REGD. No. M. 4793

# గృహలక్ష్మి

15th June 1949





By Courtesy "Jayakeralam"

# GRIHALAKSHMI

VOL. 18 No. 6

PRICE AS. 6.

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాసపత్రిక

సంపాదకుడు :

డాక్టరు కే. యన్. కేసరి

# GRIHALAKSHMI

జూన్, 1949.

సంపుటము ౧౮]     [సంచిక ౬




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్ధసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగనున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒక్కేపక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

జూన్ 3వ తేదీనుంచి

మద్రాసు క్రౌన్, స్టార్ టాకీలలోను

ఆంధ్రదేశం అంతటా విడుదల



శ్రీ రాజరాజేశ్వరి ఫిలిం కంపెని వారి

# నవజీవనం

(తమిళం)

నాగయ్య, కన్నాంబ, యస్. వరలక్ష్మి, శ్రీరామన్,
టి.ఎ. జయలక్ష్మి, టి.ఆర్. రామచంద్రన్, యల్. నారాయణరావు

డైరెక్షన్ — కె.బి. నాగభూషణం



"చిన్ని చిలుకను జేరి తెలియ చెప్పేటి,
ప్రణయగాథ లవేవో పడతిరో వినవె!"

— లీల.




జయజయ గృహలక్ష్మీ సఖీ! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతిమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!

# వరకట్నాల నిషేధపు బిల్లు.

చెన్నరాష్ట్ర శాసనసభలో వరకట్నాల నిషేధపుబిల్లు తెస్తున్నందుకు మాజీ పార్లమెంటరీ కార్యదర్శి శ్రీ తెన్నేటి విశ్వనాథంగారిని మహిళాలోకంఅంతా అభినందిస్తుంది. వెనుక భోగంమేళాల నిషేధపుచట్టాన్ని శ్రీమతి వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ గారున్నూ, బహు వివాహనిషేధపు చట్టము, వివాహవిచ్ఛేదకపు చట్టములను కాశేశ్వరరావుపంతులుగారున్నూ తెచ్చి కీర్తిగాంచియున్నారు. ఆరెంటి నేకొలదిమందియైనా నిరసించవచ్చు. దీనిని నిరసించువా రుండబోరని చెప్పవచ్చును. మగబిడ్డ లున్నవారికి ఆడుబిడ్డలుకూడ ఉంటారుకాబట్టి వారూ హర్షిస్తారు.

నిజంగా ఈ వరకట్నాల వల్ల ఎన్నిపచ్చని కాపురాలు మలమల మాడిపోతున్నాయో, ఎందరుగృహస్థులు, వారిగృహలక్ష్ములు తిన్నఅన్నము వంటబట్టక అలమటిస్తున్నారో, ఎందరు వ్యక్తురాండ్రైన బాలికలు వివాహాలు ఒకరాగానకాక పుట్టిండ్లలో ఏడుకాలాలు పడియుంటూ సిగ్గుచేత కుమిలిపోతున్నారో—చెప్పతరముకాదు. వారందరికీ ఈబిల్లు వరప్రసాదిని కాగలదని మావిశ్వాసము.

ఈబిల్లులో పెండ్లికొడుకుకు, అతని పోషకులకు వరకట్నం పుచ్చుకున్న నేరానికి శిక్షతోపాటు, జుల్మానాకూడా విధించమన్నారు. ఈజుల్మాన కూడా ఈకట్నమిచ్చే పిల్ల తలిదండ్రుల నెత్తిననే పడుతుంది! అందుచేత శిక్షేగాని జుల్మానాయుండరాదు. కాని వారుతీసుకున్న కట్నమును అసలు ఫాయిదాలతోకూడ వారిఆస్తిపై రాబట్టి—పిల్ల తల్లిదండ్రులకు చెందచేయవలయును - అని ఉండదగును. అట్లావారికి ఆస్తి లేనియడల— పెండ్లికొడుకు పిదప తన సంపాద్యములోనుండి నెల10% కు మించకుండా ఆ "అప్పు" తీరువరకు పిల్లతలిదండ్రులకు తీర్చవలయును - అని కూడా ఉండడం మంచిది.

అయితే ఇట్లా శిక్షితులైనవారు—తాము పెళ్లిచేసుకున్న ఇల్లాండ్రను సెమ్మదిగా ఏలుకుంటారా—అన్నది ప్రశ్న. అలా యేలుకోనప్పుడు వారి వివాహము రద్దు చేసుకోవచ్చును—అని కాశేశ్వరరావుగారి చట్టానికొక సవరణచేరిస్తే మంచిదని తోస్తుంది.

ఈవిధంగా శిక్షితులైనవారు ప్రభుత్వపు నౌకర్లకు, స్థానికప్రభుత్వపు నౌకర్లకు లాయఖుగారనడం, అప్పటికే ఆపదవులలో ఉంటే—"బర్తరిఫ్" చేయవలె అనడం కూడా ఈచట్టం క్రమంగా అములుజరిగి ఈ వరకట్నముల పిశాచం నాశనం కావడానికి ఎంతో తోడ్పడుతుంది.

ఈబిల్లును ప్రవేశపెట్టుచున్నందులకు విశ్వనాథంగారిని మరొకసారి అభినందిస్తున్నాము. దీని నచిరకాలంలో ప్యాసుచేయవలయునని శాసనసభవారిని కోరుచున్నాము.



# బిల్లు సంగ్రహరూపము

ఇదివరకు చట్టము, ఆచారము, అభ్యాసము ఎట్లున్నా సరే,- వరకట్నము వప్పందముచేసుకోవడంగాని, స్వీకరించడంగాని ఈ చట్టంక్రింద నిషేధింపబడినది.

*a* ఈ సెక్షన్‌లో నిషేధింపబడ్డ హంశాల నుల్లఘించిన పెళ్లికుమారుడు, రెంటిలో నేవిధమైన- 6 నె॥ లకు మించని శిక్షయు, లేక రూ. 1000 కు మించని జుల్మానాయు విధించబడును.

*b* ఆపెళ్లికొడుకు తల్లిదండ్రులు, లేక పోషకులు, లేక అతనితరఫున ఇతరులు, పైన నిషేధింపబడిన హంశాల నుల్లంఘించిన రెంటిలో నేవిధమైనదైన-2 స॥ లకు మించనిశిక్ష విధింపబడుదురు. దీనితోపాటు జుల్మానాయు వేయవచ్చును; వేయకపోవచ్చును, జుల్మానావేయునెడల నిరూపింపబడిన వరకట్నపు మొత్తమునకు మించకుండా విధింపవలయును.

పైన నిషేధింపబడిన హంశముల నుల్లఘించినందులకై శిక్షింపబడిన పెండ్లికొడుకు లేక వానితల్లిదండ్రులు, లేక వానితరఫువారు-గవర్నమెంటు ఉద్యోగములుగాని, స్థానిక ప్రభుత్వముల ఉద్యోగములు కాని ప్రభుత్వసహాయమును పొందు ఏసంస్థలలోనైన ఉద్యోగములు కాని పొందనర్హులుగారు; అప్పటికే అట్టి యుద్యోగములు చేయుచున్నచో-వారి యుద్యోగములు అంతటితో అంతమగును.

మాజీపార్లమెంటరీ కార్యదర్శి శ్రీ తెన్నేటి విశ్వనాథం ఎం. ఎల్. ఏ గారు ఈ బిల్లును రానున్నశాసనసభా సమావేశమున ప్రవేశపెట్టబోవుచున్నామని పత్రికల ప్రకటించిరి,

# ఎంతలో మార్పు

చల్లనిగాలులు
మెల్లగవీవ
కిచకిచమంటూ
కీరముల్ పలుక
భేరీరవములు
పెల్లుగమ్రోయ
టకటకమంటూ
హయముల్ పరుగిడ
మధురాపురమును
వీడుచునపుడె
రివ్వునరథమ్ము
ముందుకుసాగ
కళ్ళెము చేతను
స్వయముగబట్టి
వీరకుమారుడ
నేనేయంచు
వీరోత్సాహుడ
నేనేయంచు
హృదయానందము
వెల్లివిరియగ
పరిజనులందరు
బారులుదీరి
కోలాహలముగ
వెనుకనురాగ
గారాబుచెలియలు
ప్రేమంపురాశి
ధీరసముజ్వల
సుగుణాలవాల
దేవకీదేవిని
కాన్కలతోను
చిన్ననాటినుండియు
తోడనెలంగిన
ముద్దుచెలియలి
వీడగలేని
సంతాపమొకింత
భారముగాగ
అనురాగమొంతయు
అతిశయిల్ల
మన్ననతోడను
స్వయముగతానే
దిగబెట్టివత్తును
అత్తవారింటను
అనిదల్చితోడ్కొని
చనుచుండెనపుడు
అమితోత్సాహము
మదిచిందులాడ
రారాజుదీక్షితో
యువరాజుకంసుడు
విచిత్రసృష్టిని
తెలియంగలేక
క్షణభంగురముల్
భోగభాగ్యములని
ఇసుమంతయైనను
కానంగలేక
నీముద్దుచెలియలి
అష్టమబాలి
నీ నిండుప్రాణాలు
గైకొనునంచు
ఆకాశవాణియు
అంతలోననె
ఆప్రేమయంతయు
అణగారునట్టి
అసువులసైతము
గైకొనునట్టి
కఠోరవచనముల్
పల్కుదటంచు
ఎన్నడైననుమది
తలచెనెతాను.

—యస్. సి. త్రివేణి.

# శ్రీ తులస్యష్టోత్తర శతనామావళి



కీ॥ శే॥ వెన్నెలగంటి హనుమాయమ్మగారి జీవితచరిత్రమును, లోగడ 1934 జూలై "గృహలక్ష్మి" సంచికలో శ్రీ వంగోలు వెంకటరంగయ్యపంతులుగారు వ్రాసిపంపగా ప్రచురించియుంటిమి. ఈమె కీ॥ శే॥ వెలగపూడి సుందరరామయ్య పంతులు ఎం. ఎ. బి. ఎల్. గారి పుత్రిక; సుప్రసిద్ధులగు యరగుడిపాటివారి దౌహిత్రి. భర్త కీ॥ శే॥ దక్షిణామూర్తిగారు. ఈమెతండ్రి మద్రాసు యూనివర్సిటిలో మొట్టమొదట ఎం. ఏ. డిగ్రీ పొందినవారు. ఈమె బాలవితంతువై, భక్తిజ్ఞానవైరాగ్య సంపన్నురాలై- కొన్నిగ్రంథములను తెలుగునను, సంస్కృతమునను రచించియుండెను. ఈమె జననం 25-8-1875; మరణం 6-9-1937. ఈమెకు అభిమానపాత్రమగు గొప్పగ్రంథభాండాగార ముండెడిది; అందు కొన్ని వ్రాత ప్రతులు. వానిలో శ్రీ తులసీదేవి అష్టోత్తర శత నా మా వళియు, అష్టోత్తర శతనామ స్తోత్రమును యుండగా వానిని శ్రీ హనుమాయమ్మగారి మేనల్లుడు శ్రీ వెలగపూడి సుందరరామ దత్తాత్రేయులు పంతులుగారు శ్రీ వంగోలు వెంకటరంగయ్యపంతులుగారికి చేర్చగా వారు దయతో ప్రచురణార్థము మా కొసంగిరి.



కీ॥ శే॥ వెన్నెలగంటి హనుమాయమ్మగారు

వీని నెవరు వ్రాసిరో, అవి వారికెట్లు లభించెనో వివరములు తెలియవట.

లోగడ శ్రీ కేసరి గారు "తులసి" అని యొక చిన్నపొత్తమును రచించి ప్రకటించియుండిరి. అందు తులసి చెట్టునకు దైవీసంపత్తియేగాక వైద్యరీత్యా గొప్ప గుణములును కలవని వివరించియుండిరి. ఇటీవల శాస్త్రజ్ఞులు తులసి ఆకులరసమునుండి కర్పూరమును తయారుచేయవచ్చునని కనుగొనియున్నారు. కర్పూరము క్రిమిసంహారిణి. సర్వరోగములకు క్రిములు మూలమని ఆధునిక శాస్త్రఘోష.

ఇంకను ప్రాచీనాచారములు విడువని స్త్రీలు ఈ అష్టోత్తర శతనామ పూజా వ్యాజముననైన కొంతకాలము తులసిచెట్టుకడ గడిపి ఆరోగ్యవంతురాండ్రగుదురు కదాయని - దీనిని కృతజ్ఞతతో స్వీకరించి ప్రచురించుచున్నాము. రాగల సంచికలో స్తోత్రమును ప్రచురింతుము.

గృ. సం.

శ్రీ మాత్రేనమః
శ్రీ తులసినామ గోప్యై నమః
,, గోలోక వాసిన్యై ,,
,, కృష్ణ ప్రియతమాయై ,,
,, కృష్ణభోగా సంతృప్తమానసాయై ,,
,, మాధవగర్భ సంభూతాయై ,,
,, ధర్మధ్వజ వరాత్మజాయై ,,
,, శతాబ్ద మాతృ గర్భస్థాయై ,,
,, శుభలగ్న సముద్భవాయై ,,
,, రాధాశాప నిమిత్తజ్ఞాయై ,,
,, భూలోక సుఖవాసిన్యై ,,
,, లక్ష్మీ సఖ్యై ,,
,, కార్తికపూర్ణిమా సితవారజాయై ,,
,, శరత్పార్వణ చంద్రాస్యాయై ,,
,, శరత్పంకజలోచనాయై ,,
,, పక్వబింబాదరోష్ట్యై ,,
,, పద్మాంశాయై ,,
,, అతిమనోహరాయై ,,
,, హస్తపాదతల రక్తాయై ,,
,, నిమ్ననాభి మనోరమాయై ,,
,, సునాసాయై ,,
,, త్రివళీయుక్తాయై ,,
,, నితంబయుగ వర్తులాయై ,,
,, శీతకాలోష్ణ సర్వాంగ్యై ,,
,, గ్రీష్మకాల సుశీతలాంగ్యై ,,
,, నీలాలకాయై ,,
,, మహాకేశ్యై ,,
,, న్యగ్రోధ పరిమండలాయై ,,
,, పీతచంపక వర్ణాభాయై ,,
,, సుందరీజన సుందర్యై ,,
,, బదరీవన వాసస్థాయై ,,
,, శ్రీకృష్ణధవ కామనాయై ,,

శ్రీ గ్రీష్మపంచాగ్ని మధ్యస్థాయై నమః
,, శీతార్ద్రాంబర ధారిణ్యై ,,
,, శరద్వింశక సాహస్రక్షీరతోయాయై ,,
,, ఫలాశనాయై ,,
,, శరత్త్రింశక సాహస్రపత్రాహారాయై ,,
,, కృశోదర్యై ,,
,, చత్వారింశత్సహస్రాబ్దవాయ్వాహారాయై ,,
,, తపస్విన్యై ,,
,, దేవాబ్దదశ సాహస్రనిరాహారాయై ,,
,, నిరామయాయై ,,
,, దేవాబ్ద లక్షకాలైక లక్ష్యాయై ,,
,, ఏకాంఘ్రి సంస్థితాయై ,,
,, శ్రీ షోడశాక్షరీత్యాది రాధామంత్ర జపాన్వితాయై ,,
,, విధిలబ్ధ వరాయై ,,
,, శంఖచూడ ప్రియతమాసత్యై ,,
,, శంఖచూడ మానసోల్లాసాయై ,,
,, పాతివ్రత్య పరాయణాయై ,,
,, మన్వంతరావధిశంఖచూడప్రాణప్రియాయై ,,
,, వరాయై ,,
,, స్వసేవక జనానంత ఫలదాయిన్యై ,,
,, విష్ణువంచితాయై ,,
,, శ్రీకృష్ణదర్శనానందాయై ,,
,, శ్రీవిష్ణు స్నేహమూర్ఛితాయై ,,
,, స్వశాపలబ్ధశ్రీవిష్ణుసాలగ్రామశిరోమణ్యై ,,
,, త్యక్తదేహాయై ,,
,, మహాదివ్యదేహాయై ,,
,, గోలోకగామిన్యై ,,
,, స్వకేశ వృక్షరూపాయై ,,
,, స్వతనుర్గండకీనద్యై ,,
,, శంఖాపరిస్థితాయై ,,
,, నందాయై ,,
,, శ్రీ సాలగ్రామ మందనాయై ,,

| | | |
|---|---|---|
| శ్రీ | తిరోధనముఖ్యై | నమః |
| ,, | కృష్ణస్తుతి ప్రీతాయై | ,, |
| ,, | మహోమనాయై | ,, |
| ,, | బృందాయై | ,, |
| ,, | బృందావన్యై | ,, |
| ,, | విశ్వపూజితాయై | ,, |
| ,, | విశ్వపావన్యై | ,, |
| ,, | పుష్పసారాయై | ,, |
| ,, | నందిన్యై | ,, |
| ,, | తులస్యైః | ,, |
| ,, | కృష్ణజీవన్యై | ,, |
| ,, | స్వనామస్మరణానందదాయిన్యై | ,, |
| ,, | కృష్ణపూజితాయై | |
| ,, | విష్ణువక్షస్థితలోల మాలాయై | ,, |
| ,, | కృష్ణాంఘ్రి ఘోషితాయై | ,, |
| ,, | కృష్ణదత్తాత్మ సౌభాగ్యాయై | ,, |
| ,, | కృష్ణధ్యాన పరాయణాయై | ,, |
| ,, | కృష్ణదత్తవరైశ్వర్యాయై | ,, |
| ,, | సురబృందాంఘ్రి పూజితాయై | ,, |
| ,, | కలికల్మష ప పఘ్న్యై | ,, |
| ,, | గృహస్థజన పూజితాయై | ,, |
| ,, | స్వస్పృశ్యజనవైకుంఠదాయిన్యై | ,, |
| ,, | రాధికాసఖ్యై | ,, |
| ,, | సురపూజ్యాయై | ,, |
| ,, | శుభాకారాయై | ,, |
| శ్రీ | సౌభాగ్యజన భాగ్యదాయిన్యై | నమః |
| ,, | ధర్మాయై | ,, |
| ,, | ధర్మాసనాయై | ,, |
| ,, | దేవ్యై | ,, |
| ,, | దేవదేవమనః ప్రియాయై | ,, |
| ,, | బృందావన జనానందాయై | ,, |
| ,, | భగవత్ప్రీతి కారిణ్యై | ,, |
| ,, | శ్రీకృష్ణక్రీడ నాసక్తాయై | ,, |
| ,, | రాసమండల మండనాయై | ,, |
| ,, | స్వదశార్చిత శ్రీకృష్ణభక్త సామ్రాజ్య దాయిన్యై | ,, |
| ,, | కృష్ణపాదసంలగ్నచిత్తాయై | ,, |
| ,, | శ్రీకృష్ణ కింకర్యై | , |
| ,, | భుక్తిదాయిన్యై - | ,, |
| ,, | ముక్తిమూలాయైః | ,, |
| ,, | గృహస్థజనపావన్యై | ,, |
| ,, | మందస్మిత ముఖాంభోజాయై | ,, |
| ,, | పవిత్రదళరూపిణ్యై | ,, |
| ,, | భవసంతాపశమన్యై | ,, |
| శ్రీ | సర్వసంపత్ప్రదాయిన్యై | నమః |

ఇతి శ్రీతులస్యష్టోత్తర శతనామావళి స్సమాప్తా.

శ్రీ శ్రీ శ్రీ

(ప్రతినామమునకు ముందు శ్రీ అనియు నామాంతమున నమః అనియు చెప్పుచుండవలయును.)

# సంపూర్ణ జీవనమునకు సాధనములు

సంపూర్ణ జీవనమనగా అర్థమేమి? దానినిగురించి కొంతవఱకు ఆలోచించి చూస్తాము.

పుష్కలముగా డబ్బుసంపాదించి, సకలైశ్వర్యములతో, సర్వ సుఖములతో గూడిన జీవితము సంపూర్ణమేనా? కాదు. అప్పుడును ఏదోఒక కొఱతగాని, దుఃఖము గాని, ఇంకా కావలెనన్న కోరికగాని యుండవచ్చును.

అయితే, సంపూర్ణ జీవులెవరు? మన సకల శాస్త్రములు, వేదములు, భగవద్గీత, ఘోషించుచున్న, యోగమును, జ్ఞానమును తెలుసుకున్న, మహాత్ములే, సంపూర్ణజీవులు. రామతీర్థుడు, రామకృష్ణ పరమహంస, వివేకానందస్వామి, గాంధీ మహాత్ముడు అటువంటివారే సార్థకజన్ములు.

వారికి కష్టసుఖములు సమానమే. పేదఱిక, పెద్దరికములు, ధనికత్వదారిద్ర్య ములు సమానమే. అగ్రజాతివారు, అధోజాతివారు సమానులే. అన్నిటియందును సమత్వముజూచువారే, భగవంతుని చూచెదరు. ఆ భగవంతుని కనుగొన్నవారే, బ్రహ్మసాక్షాత్కారము పొందినవారే, సంపూర్ణజీవులు. అదియే సంపూర్ణజీవనము. అదియే జీవితపరమావధి.

మానవులు ఏనాటికైనను, తమజీవితములో, లేక ఏజన్మలోనైననూ ఈసత్య మును గ్రహించ వలసియేయున్నది. ఇదిప్రకృతి సిద్ధమైనధర్మము; గనుక మనము జ్ఞానమువలన, గృహస్థజీవనములో, ఇదిధర్మము, ఇదిఅధర్మమని తెలుసుకొని ప్రతి ఫలాపేక్షలేక, అన్నికర్మలు చేయవలసినది, మనవిధియనితలచి, మనకు లభించిన దానితో తృప్తిచెంది, కష్టంవచ్చినప్పుడు కృంగిపోక, సుఖ, సంతోషములు గల్గినప్పుడు ఉప్పొంగిపోక వున్నతపదవి వచ్చినప్పుడు గర్వపడక, దయ, శాంతముకల్గి స్వార్థత్యాగ ముతో సత్యమార్గ మవలంబించుట, ఇవియే సంపూర్ణజీవనానికి మనము అలవరచు కొనవలసిన సాధనములు.

ఇట్లు నడచుకొనుశక్తి ఆ పరమేశ్వరుడు మనకందరికి నిచ్చుగాక.

నెమలి చంద్రమతిదేవి.

# మచిలీపట్నం మహిళా సేవామండలి



## హిందీ నాట్యతరగతుల విద్యార్థినులు

కూర్చున్నవారిలో మధ్యనున్నవారు ముగ్గురు ఉపాధ్యాయినులు:
(ఎడమవైపునుండి) శ్రీ ఓలేటి సత్యవతిగారు, శ్రీ చల్ల శారదా
దేవిగారు, శ్రీ కాదంబరి ప్రేమగారు (శ్రీ నాట్యోపాధ్యాయిని)

[వీరు హిందీతరగతులు ప్రారంభించి 4, 5 సం॥ లైనది. ఇంతవరకు వీరి శిక్షణవల్ల 20 మంది ప్రాథమికకు, 7 గురు మధ్యమకు, 2 రాష్ట్రభాషకు, 1రు ప్రవేశికకు, 1 విశారదకు వెళ్లి ఉత్తీర్ణులైనారు. ఈ ఆగస్టుపరీక్షకు కూడా కొందరు చదువుచున్నారు.]




చిన్నారి నడుమునఁ జిఱుతగంటలు మ్రోయ
మోమునఁ జిరునవ్వు మొలక లెత్త
ఘనఘనా ఘనలక్ష్మి నెనయంగఁ జాలెడు
తనుకాంతి దిశలందుఁ బెఁగొనంగ
అర్ధచంద్రుని తేజ మపహాసించు లలాట
మందు ముంగురులు చెన్నొందు చుండ
గమనీయ కోమల కరపల్లవంబులఁ
గంకణ ఘన రణత్కార మెసఁగఁ



గాళియాహీంద్ర. తత ఫణాగ్రముల నిలిచి
దాండవించెడు నడుగు గెందామరముల
నందియలు మ్రోయ సురుచి రానందలీల
నరుగుదే వోయి నా చెంత కబ్జనయన.

బాలకృష్ణా నే నల్పజీవిని. నాయందును నీకవ్యాజప్రేమ గలదనుటకు సందేహము లేదు. అజ్ఞాని నగు నా కించుక విద్యాబుద్ధుల నొసంగి రక్షించితివి. వీనివలన నీ సృష్టివైచిత్ర్యమును గ్రంథమాలమునఁ జదువుటయు, వినుటయు లభించుచున్నది. ప్రకృతి సౌందర్యమును గాంచి విమర్శించి తత్కర్తవగు నీ దివ్య తత్త్వమును గ్రహించి ఆత్మానందమును పొందగలశక్తిని ప్రసాదింపుము.

ప్రభూ! ఎన్నిదినములనుండియో నీ స్వరూపమును గన్నులార గనవలయునని వాంఛించుచున్నాను. బృందావనమున శరద్రాత్రియందు సవ్యాపసవ్య పాదాంగుష్ఠము లూతగా ధరణిపైనిలిచి, ముంగురులు మోమున నృత్యమాడుచుండ జగన్మోహనముగ మురళిమ్రోయింప ధేనువులు మేతమాని, మోరలు పైకెత్తి, యానందబాష్పములు విడుచుచుండెడివట. ఆ నీగానమాధుర్యమునకు పాదపంబులు తలలూప భక్తిపారవశ్యమున రాధారమణి, పాదపూజకై యేరితెచ్చిన పద్మములా - యన్నట్లున్న తన రెండుహస్తముల నీ కృపాభిక్ష నందుకొనుటకు గాబోలును దోసిలొగ్గి మోకాళ్లమీఁద నిలువంబడి, ముఖమునఁ బైకెత్తి, అనిమేష లోచనయై యానందపారవశ్యమున బ్రపంచమునే మఱచి విశ్వమోహనమైన నీ గానములో ప్రాణముల లీనమొనర్చి చేష్టారహితకాగా, ఆకోమలిని నీ శీతలకరస్పర్శచే తేర్చి యాదరించితివట. ఆనీ దివ్యస్వరూపము నీ దీనురాలి హృదయఫలకమునఁ జిత్రింపవా?

ఎన్నియో సార్లు నిన్ను నా హృదయపీఠమున నిల్పుకొనవలయునని యత్నించి పట్టితెచ్చితిని. నీవు క్షణమైన నిలువక పరుగెత్తుచుంటివి. దేవా! నా యపరాధమేమి? దీనజనావనుడవగు నీ విట్లు సేయ నబలనగు నేనేమి చేయగలను? కంటికగుపడినట్లేయుండి అంతలో మాయమగుదువు. ఎంత వెదకినను దొరకక ఏమరుపాటున నున్నపు డెదుట సాక్షాత్కరింతువు. అర్ఘ్యపాద్యాదివిధులఁ బూజింతమన్న నంతలో మాయ మగుదువు. ఏమి నీ చిత్రలీలలు?

దీనులగావఁ గంకణము గట్టితివఁట! అది కల్లగాకున్న నేల నన్నిట్లు వంచఁజేసెదవు? కొన్నిదిన ములనుండి నీ రూపచిహ్నమైనను గోచరించుటలేదే? నేనొనర్చిన యొగ్గేమి? పూతనవలె విషమొసంగితినా? శకటాసురాదులవలె అపాయ మాపాదించితినా? కంసునివలె హింసించితినా? వారినెల్ల దర్శన స్పర్శ నాదులచే తరింపఁజేసితివట. ఏపాపమెఱుగని నాపై నీకేల యింతకోపము?

పరమయోగీంద్ర హృదయానందకందంబును, కమలభవభవాది సకల సురనికరవందితంబును, ప్రహ్లాద నారద వ్యాస శుకాది భక్తగణాభినందితంబును, బృందావనాంతరవిహారంబును, గోపికాచిత్తచోరంబును, యశోదానందతపఃఫలంబును, నగు నీ సుందరాకారమును జూడఁగోరి గ్రీష్మతపతప్తయగు వసుంధర పయోధ రములరాకకై పరితపించినరీతి నీయాగమనమునకై నిరీక్షించుచున్నాను., ఏనాటికి నీకరుణామృతమును వర్షించి నాహృదయతాపము బాపెదవో యెఱుఁగజాలను.

ఓ దేవాధిదేవా! నీవు పీతాంబరధారివై, జగన్మోహనాకారుఁడవై, మురళీధరుఁడవై నా హృదయ పీఠము నధిష్ఠింతువేని, జలజాంకుశాది రేఖలుగల నీ పాదపద్మములకు నా యానందబాష్పములతో నభిషేక మొనరించి, హృదయకమలముచేఁ బూజించి, శరత్కాల సంపూర్ణచంద్రమండలముం దృణీకరించు నీ ముఖ మండలమును గాంచి, పులకితగాత్రినై, యానందపారవశ్యమున నా సర్వస్వము నర్పింప సంసిద్ధురాలనై యుంటిని. జాగేల?

కామక్రోధాది కంటకయుతంబును, ఈర్ష్యాసూయాది భీకర పక్షికుల సంకులంబును, తమోమయ గాఢాంధకారబంధురమునైన నా మనోవీధి నడుచెంచుటకు సందేహించుచుంటివా? ఒక్కసారి నీ ప్రణయ మారుతము నాపై నించుక వీచెనేని యీ కంటకములన్నియు తొలఁగి సుగమ్యమగునుగదా? కోటిసూర్య ప్రకాశమానమగు నీ రూపచిహ్నము గోచరించినమాత్రంబున నీ గాఢతమస్సు పటాపంచలై పాఱిపోవునే. అప్పుడు శుద్ధసత్త్వమైన నా హృదయపీఠము నీకు నివాసయోగ్యము కాగలదు.

ఈ మార్గమును నేనే బాగుపఱుపవలయునన్నచో నా జీవితమంతయు దీనికేచాలదే? నీ సుందరా కృతిని జూచు భాగ్యములభించుటెట్లు? దయామయా! నీ కృపావీక్షణముల నన్నవలోకింపుము. పురుషోత్తమా! రక్షింపుము.

దీనజనావన దీక్షాపరతుఁడ వీవు;
దీనుల దీనను దేవదేవ;

శరణాగతత్రాణ బిరుదాంకితుఁడ వీవు;
　　　　చరణంబు నమ్మితి జలజనయన;
భక్తులపాలిటి పారిజాతమ వీవు;
　　　　భక్తిఁగోరుదు నేను బద్మనాభ;
భవభయంబు లడంచు పరమాత్ముఁడవు నీవు;
　　　　భవభయాతుర నేను బరమపురుష;

ఏవిధంబునఁ జూచిన నేను నీకు
విడువరాని బాలిక నాదు విశ్వనాథ
నన్నుఁ బ్రోచు భారంబు నీ కున్నదయ్య
ఎందు కీ జాగు రమ్మిఁక నందతనయ.

జిలిబిలి పలుకులు పలుకుచు
కిలకిలమని నవ్వుకొనుచు కేరింతలతో
నలరుచు నాడుచుఁ బాడుచుఁ
జెలగిన నీ బాల్యమునకు జేజే కృష్ణా!

సూరి నాగమ్మ.

[ఈ రచయిత కొన్నిసంవత్సరములుగా తిరువణ్ణామలయందు శ్రీ రమణమహర్షులవారి శిష్యయై అందే నివసించుచున్నది. ఈమె కొంతకాలంక్రిందట వ్రాసిన "శ్రీ రమణాశ్రమ లేఖలు"—ఆమె రచనాసామర్థ్యమునేగాక ఆమెకుగల మహర్షుల సన్నిహితత్వమును తెల్పెడిని. ఆమె ఆ ఆశ్రమమున అంతేవాసికాకమున్నే రచించినదీ రచన. గృ॥ సం.]

# తీయని కోర్కెలు

శ్రీమతి దేశిరాజు భారతీదేవిగారు

పరిమళంబుల నీను పారిజాతంబునై
చిరుత రెమ్మల మీఁద చెలరేఁగగా నుండు
టది యెంతటి యదృష్టమే! నెచ్చెలీ!
మది కెంత సంతోషమే!

జలజలా ప్రవహించు సెలయేరునై బుట్టి
కలకల ధ్వనులతో క్రమగతి నేతెంచు
టది యెంతటి యదృష్టమే! సోదరీ!
మది కెంత యానందమే!

దివ్య విపంచిపై భవ్యగీతము బాడి
రహి బుట్టగా జేయు రాగంబు నేనైన
అది యెంతటి యదృష్టమే! నెచ్చెలీ!
మది కెంత సంతోషమే!

గండుకోయిల బాఁకు కమనీయ రుతమునై
జనుల కాహ్లాదంబు జనియింప గా జేయు
టది యెంతటి యదృష్టమే! సోదరీ!
మది కెంత యానందమే!

కవి చేతి కలమునై కళలెల్ల గైసేసి
కావ్య కన్యకతోడ గణన కెక్కిన నేను
అది యెంతటి యదృష్టమే! నెచ్చెలీ!
మది కెంత సంతోషమే!

కలుష సంహారియా గంగా ప్రవంతిలో
కొదమ రాయంచనై ముదమార తిరుగాడు
టది యెంతటి యదృష్టమే! సోదరీ!
మది కెంత యానందమే!

మధుపంబు బాడెడు మధుర ఝంకృతమునై,
మలయానిలంబు, తో గలసి యున్నట్లైన
అది యెంతటి యదృష్టమే! నెచ్చెలీ!
మదికెంత సంతోషమే!

పూలలో తావినై గాలి కెరటంబునై
యాకాశ వీధుల్లో నట్టిట్టు నడయాడు
టది యెంతటి యదృష్టమే! సోదరీ!
మదికెంత యానందమే!

తరిపి వెన్నెల్లోన తళతళా మెరసేటి
తారనై నేబుట్ట నేరనైతిని గదా?
అది యెంతటి యదృష్టమే! నెచ్చెలీ!
మదికెంత సంతోసమే!

మేఘంబు లోని క్రొమ్మెరుగునై నేబుట్టి
మిలమిలా మెరయుచు మింట నే విహరించు
టది యెంతటి యదృష్టమే! సోదరీ!
మదికెంత యానందమే!

ఎల్లరీ హృదయాలు పల్లవింపగ జాలు
వాసంత ఋతువునై వసుధ నేజన్మించు
టది యెంతటి యదృష్టమే! నెచ్చెలీ!
మదికెంత సంతోషమే!

దేవదేవుని దివ్య ధామంబునకు జేరి
దివ్య తేజములోన తిరముగా నైక్యమా
టది యెంతటి యదృష్టమే! సోదరీ!
మదికెంత యానందమే!



# స్వార్థము

ఆ! ఆ! బిడ్డా! ఆగుము. ఆగుము! యని యెచ్చటినుండియో నొక ధ్వని వినవచ్చెను.

శాంతి సహనముతో మిళితమైన యా కంఠ ధ్వని యప్పుడే తన జీవిత పరమావధికి ఒక్క జోహారు యొనర్చుటకు సంసిద్ధురాలుగానున్న కమల భయంకరోద్యమమునకు భంగము కలిగించెను. కమల వెనుదిరిగి చూచెను కాని యామె కెవ్వరును గోచరింపలేదు.

అదియొక భీకరారణ్య ప్రదేశము. కారుచీకట్లు నలుదిశలు వ్యాపించుటచే బాటసారుల కొంచెమైన యేని మార్గము గానరాకుండెను. నక్షత్రములు మాత్రము తమ స్వల్పకాంతిచే నా గాఢాంధకారమును ఆపదలోనున్న వారికి ఆశాలతను చూపించురీతి భేదించుచుండెను.

అట్టి సమయమున నొక వనిత ఆ అరణ్యముగుండా వడివడిగా నడచిపోవుచుండెను. ఆమె మధ్య మధ్య, అస్పష్టవచనములు పలుకుచు, శిథిలమైన పమిట చెంగుతో వేడికన్నీటిని తుడుచుకొనుచు, మార్గ మధ్యమున నున్న పెనువృక్షములను మాచి యదలుచు మరల తాను తలపెట్టిన కార్యము మనంబున సోకినంతనే లేని ధైర్యము తెచ్చుకొని నడువసాగెను. ఆబిడ ముఖరీతిని తిలకించిన నేదియో నొక సాహసకార్యము చేయ నుంకించెనని తెల్లమగును. ఆ విధముగాపోయిన స్త్రీ కొలదికాలములో నొక అగాధ కూపము చెంత నిలిచెను. ఈ ప్రదేశమే ఆ స్త్రీ మూర్తి నిర్ణయించుకొన్న గమ్యస్థానము.

మొదలే ఎక్కువ నీరసస్థితిలోనున్న యామె వేగముగానడచుటచేత ఆయాసము ఎక్కువాయెను. కాని ఆ తాత్కాలికబాధ ఆస్త్రీ, కార్యనిశ్చయమునకు అడ్డురాలేదు. గతించిన జీవిత సంగ్రహము రాబోవు ఆశాజ్యోతికి తావొసంగక ఆమె మనోనిశ్చయమును వృద్ధిపరచెను. కష్టపరంపరలతో గడచిన జీవయాత్రను ముగించుటయే యామె దృఢసంకల్పము. ప్రయత్నించెను. కాని యొక యపరిచిత కంఠధ్వని భంగపరచెను.

పాఠకులారా! ఇప్పుడైనను గ్రహించితిరా ఆమె ఎవరని? ఆమెయే మన కమల. ఇట్టి చీకటిరాత్రి వేళ నిర్జనప్రదేశమందు ఒక్క స్త్రీ ఆత్మహత్యకు తలపెట్టిన లోకము విపరీతార్థము చేయును. స్వార్థంతో నిండిన ఈ ప్రపంచమునుండి వేరుకావడమే కమల ఆత్మహత్యకు కారణము. బీదల రక్తమాంసములే ఆహార పానీయములుగా పెంచబడిన నరరూప ధనికరాక్షసులకు తనయునికి తెలియకుండునట్లు నిర్జనప్రదేశము ఏర్పరుచుకొనెను.

కమల రెండవసారి ప్రయత్నించెను. ఈ పర్యాయము నొక యపూర్వ తేజస్విని బాష్పాకుల లోచనియై కమలను అత్యాదరముతో చేయిపట్టిలాగెను. ఆ సుందర విగ్రహము జనసంచారములేని యా రాత్రివేళ తిలకించి, భయకంపితయై మూర్ఛపోయెను.

ఆ నూతనవ్యక్తి తన సహజ వాత్సల్యముతో మాతృప్రేమ తొలకరింప, కమల కొంత యుపచారము చేయగా కొంత సేపటికి కమల కన్నులు తెరచి ఆందోళనముతో నామెను చూడసాగెను. అప్పుడా వనిత ప్రేమతో "కమలా! ఇట్టి భయంకర కృత్యము చేయుటకు కారణమేమి?" యని యడిగెను.

కమలకు ఇది యంతయు స్వప్నమువోలె పొడసూప లేనిధైర్యమును తెచ్చుకొని ఇట్లనియె.

తల్లీ! శాంతిమార్గ మన్వేషింపబోయిన నాకు నీవేల యడ్డుతగిలి, నా కార్యము విఫలము చేసితివి?

నూతనవ్యక్తి:— బిడ్డా! ఇంత చిన్న వయస్సుననే ప్రపంచముపై ఏల విరక్తి కల్గెను? నీ జీవిత కథను నాకునూదెల్పి నా సంశయము నివారింపుము.

అప్పుడే వ్యధచెందిన యీ లేతగుండె గతించిన జీవితమును తలంచుకొని భోరున ఏడువసాగెను. ఆవేదన తూగుటుయ్యాలలో శయనించు ధనికులకు కర్ణకఠోరముగా యుండెను. కాని యీ యడివి రోదనము నా నూతన వ్యక్తిని సహితము కలంచి వైచెను. ఇక ఓర్చుకొను శక్తిలేక కాబోలు యీమె కూడా కమలతోపాటు పెద్దపెట్టున ఏడ్వసాగెను. తర్వాత నా వ్యక్తి కమలను ధైర్యవచనములచే నోదార్చెను.

తల్లి ఉపశమనపు పలుకులచే కమల కొంత వరకు దుఃఖము దిగమ్రింగి తన విషాదగాథను చెప్ప మొదలిడెను.

జననీ నేనొక సాధారణ కుటుంబీకుని పుత్రికను. వంగదేశము నా జన్మస్థానము. పరుల ధనమున కాశపడక, ఉన్నదానితో తృప్తిచెంది కాలము గడుపువాడు నా తండ్రి. కాని, నా తండ్రి మనస్సులో ఏదియో యొక విషాదము వేధించుచున్నదని, అతని భావములను, పలుకులను పట్టి గ్రహించితిని. అయితే సంశయ నివృత్తికి తగుఅవకాశము కలుగలేదు. ఇట్లుండ నొకనాడు, నా తండ్రి ఒంటరిగానుండుటచూసి, దగ్గరకుపోయి నా మనస్సులోనున్న సందేహమునకు కారణమడిగితినికాని త్వరలో సమాధానమురాలేదు. అయితే నా తండ్రి ముఖములో విపరీతపు మార్పులు కలుగజొచ్చెను. ఏమియు అర్థముకాని మనస్సుతో అతనివైపే క్షణకాలము చూచుచుండగా, కొంతసేపటికి కన్నీళ్లు తుడిచివైచి నా ప్రశ్నకు ఈ విధముగా సమాధానము చెప్పెను. కమలా! సకలైశ్వర్యముల కాటపట్టైన భారతీదేవి నేడు స్వాతంత్ర్యము గోల్పోయి పరులపాలాయెనుగదా? ఇంతకన్న వేరు చింత భారతీయునికికలదే. అప్పటికి నాకు నిజతత్వము బోధపడెను. అంతవరకు అజ్ఞానాంధాకారములో మునిగియున్న నాకు జ్ఞానోదయము కలిగెను.

"ఉడుత భక్తివోలె" నేను కూడ స్వాతంత్రోద్యమమునకు పూనుకొంటినికాని, నా తలంపులు వేరు విధముగా పరిణమించెను. పెనుభూతమువోలె వంగదేశమునకు క్షామము సంభవించెను. ఆ క్షామ బాధ తలంచుకొన్న ఇప్పటికిని గుండె బ్రద్దలైపోవును. తల్లీ! ఆ మహాక్షామము నా ప్రియజననిని తనలో చేర్చుకొనెను. ఇంకేమున్నది. నా అమూల్యమగు వస్తువును ధారవోసుకొని, నా తండ్రి, చిన్నచెల్లెళ్లతో, నేను జనపదమును శాశ్వతముగావదలి కలకత్తా నగరము ప్రవేశించితిని.

ఎటుచూచినా పరిస్థితులు విషముముగా పరిణమించెను. భారతదేశపు దుస్థితికై దుఃఖింతునా! భారతీయ సోదరుల స్వార్థము కొరకు వ్యసనపడుదునా? ఇట్లు కొంతకాలము గడువగా ఒకనాడు నా తండ్రి ఆనందోద్రేకముతో పరుగిడివచ్చి, కమలా! చిరకాలపు భారతీయులశ్రమ నేడు ఫలించెను. మనమిక నేటినుండి స్వతంత్రులము. కాని, మన తండ్రి కోరిక పూర్తివిజయము పొందలేదు. దేశము రెండు చీలికలుగా భాగింపబడెను. పరస్పర ఐకమత్యము త్వరలోనే సంపూర్ణ విజయము పొందునని యాశిస్తున్నాను. అమ్మా! నీకు నిజముగా మహాత్ముడే తండ్రిసుమా! అతని బోధవలనే నీవు జీవితాంతము వరకు అనుగమింపవలయును.

నూ-వ్య:- అమ్మా! అట్టి జనకుని విడనాడి ఇట్టి స్థలమునకు రానేల?

కమల:- పూజ్యుడగు నా జనకుడు సజీవుడైయున్న నా కిందులకిట్టి దురవస్థ కల్గును. స్వాతంత్ర దినపు ఫలితములు పెక్కుదురంతములకు మార్గదర్శక మయ్యెను. ఆ దినములలో ఒకనాడు బయటికిపోయిన నా తండ్రి సాయంకాలము వరకు రానేలేదు. ఎక్కడ వెదికినను అతనిజాడ తెలియలేదు. లోకసంరక్షకుని చేతులలో మా యిద్దరిని వప్పగించి తాను దూరమైపోయెను.

ఇక కలకత్తా నగరమున నుండుట అపాయకరముగా నుండెను. దినదినమునకు అల్లరులు చెలరేగెను. దైవము మా యందుండబట్టి కలకత్తా నగరమునుండి తప్పించుకొంటిమి.

సూ-వ్యః- కలకత్తానువదలి మరెక్కడికి వెళ్లితిరి ?

క:- దిక్కులేని మాకు ఒక చోటు ఉన్నదా ఏమి ? క్రమ క్రమముగా చెన్నరాజధాని చేరితిమి. రాగిదమ్మిడీలేని నేను ఇరువురు ప్రాణాలను ఏ విధముగ పోషించను ? అప్పటికి దేహకష్టమే ముఖ్యావసరముగాతోచెను. వెంటనే ఒక మిల్లులో కూలీగా ప్రవేశించి ధనమార్జింప మొదలు పెట్టితిని. తల్లీ ! పగలంతయు కష్టపడి సాయంత్రమునకు కూలి డబ్బులతో ధాన్యమును కొనుటకు పోవగా ఎక్కడలేని దుఃఖముకల్గును. ఆ బియ్యమును చూచుటకే భయంవేసును. భరింపరాని దుర్గంధము వాటిలోనుండి వచ్చును. అమ్మా ! అట్టి బియ్యమును మా ముఖమున వేయుదురు.

సూ-వ్య:- సస్యశ్యామలగా నలరారుచున్న భారతదేశమున కిట్టి దుస్థితికల్గినది. కమలా ! అందరు అట్టి బియ్యమునే తిందురా ?

క:- అందరికి తినవలసిన కర్మఏమి కల్గినది. అమాయకపు రైతుయొక్క రక్తధారలచే పండించిన ధాన్యమును, అన్యాయముగా ఈ ప్రభుత్వ ఉద్యోగస్థులు తక్కువ ధరకు కొనెదరు. కొంత ప్రజలకు, కొంత స్వార్ధమునకు. తల్లీ ! చెడినది ఎవరు ? కష్టజీవి రైతు. నోరులేని బీదవాడు.

సూ-వ్య:- అయితే, అంత ధాన్యమును వారేమి చేయుదురు ?

క:- అయ్యో ! పిచ్చితల్లీ ! నల్లబజారున్నంతవరకు వారికేమికొదవ ? ఇక్కడ ప్రజలనోరుకొట్టి, అక్కడ ఎక్కువ ధరతో అమ్మెదరు.

సూ:- ఇట్టిదుండగములను అరికట్టుటకు ఏ ప్రయత్నములు లేవా ?

క:- లేకేమి ? ఈ రక్షణమంతయు నామ మాత్రమే. పై ఉద్యోగినుండి క్రింద సేవకుని వరకు లంచగొండితనము ప్రబలి యున్నప్పుడు ప్రజలకు యెక్కడినుండి సౌఖ్యముకల్గును. పవిత్రమగు కాంగ్రెసును, ఈ వేషధారులు అపవిత్రము చేస్తున్నారు. ప్రజాప్రభుత్వము ప్రజలకు మేలుచేయుటకుబదులు శతృత్వము చూపినది. ఇట్టివారినుండి తప్పించుకొనుటయే మేలని నా యభిప్రాయము.

సూ-వ్య:- కమలా ! తర్వాత నీ కథయేమి ?

క:- ఏమిచెప్పుదునమ్మా ! అట్టి ఘోరమగు బియ్యమునుతిని నా చెల్లెలికి తీవ్రమైనవ్యాధికల్గెను. కడుబీదరాలనగు నేను ఏమిచికిత్స చేయగలను. ఎక్కడనుండి ధనమును తీసికొనరాగలను. కట్టకడపటికి ప్రభుత్వ వైద్యశాలకు తీసికొనపోతిని. అక్కడకూడా స్వార్ధమేనా ? ఎంత నీచాతి నీచము నా బోటి దాని దగ్గరకూడా ధనమడగడము ? ప్రభుత్వమిచ్చు వేతనములు వారికి చాలదు గాబోలు. బీదలధనమన్న ఎక్కువ ప్రీతియేమో ! ఏమి చెప్పగలను వారిగొప్ప గుణము. శ్లాఘనీయము. తర్వాత నా ప్రియసోదరి గతి ఏమైనది మీ రర్ధము చేసికొనవలె. (ఇక కమల దుఃఖము ద్విగుణీకృతమయ్యెను.) తల్లీ ! ఇక జీవితముపై విరక్తికల్గి ఈ సాహసకృత్యమును తలపెట్టితిని. ఇది నా జీవితకథ అమ్మా ! నన్నీపనినుండి ఆపి, ఎవరికీ ఇష్టములేని నా జీవిత సంగ్రహమును యడిగిన మీ కథకూడ వినగోరెదను.

సూ-వ్య:- కమలా ! వినగోరెదవా ? నీ వలెనే నాదికూడా దుఃఖ భూయిష్టమైన జీవితము. నాపేరు భారతీదేవి. ఏకగర్భ జనితులు. ఒకరినొకరు హింసించుకొనుచుండ కన్నతల్లికి సౌఖ్యమెక్కడిది ? తర్వాత దేవి కంఠము బొంగురుపోయెను. కమలా ! శాంతమే నాయిప్పటి ఆయుధము. బిడ్డలెంత క్రూరులుగానున్నను కన్నతల్లి తీక్షణరూపము వహింప నొల్లదు. వారిలో కలుగు పరివర్తనమునకై వేచి హితవచనములచే జ్ఞానోపదేశము చేయుట ముఖ్యావసరము.

బిడ్డా ! నీవు ఈ సాహసకృత్యమునుండి విరమించుకొని లోకమునకు పవిత్రోపదేశము నొసంగుము. అప్పుడే నీ జీవితము పావనమగును. ఈ మాటలు ముగిసినంతనే దేవి యంతర్ధానము నొందెను. కమల పరివర్తన హృదయముతో వెనుదిరిగెను.

వి. సముఖం.

# నా చిన్ననాటి ముచ్చట్లు

డా॥ కే. ఎన్. కేసరి

నేను వెనుక 1947 సం॥ నవంబరునెల గృహలక్ష్మి సంచికలో కాశీయాత్రనుగురించి క్లుప్తముగ అన్నియాత్రలతోపాటు వ్రాసియుంటిని. నేను ఆయాత్రకుపోయినప్పుడు ఒక డైరిని వ్రాసివుంచితిని. అప్పుడు ఆడైరి నాకు కనబడకపోవుటవలన జ్ఞాపకమున్నంతవరకు అన్నియాత్రలతోకూడ కాశీయాత్రను వ్రాసితిని. ఇప్పుడునాకు అప్పుడువ్రాసినడైరి దొరికినందునమరల వ్రాయుచున్నాను-కాశీనిగురించి యెన్నిపర్యాయములు వ్రాసిననేమి? చదివిననేమి? 1830లో కాశీయాత్రకు పల్లకీలపై, బండ్లపై బంధుమిత్ర పరివారసమేతముగ వెళ్లి వచ్చిన శ్రీయేనుగలవీరాస్వామయ్యగారు,చెన్నపట్టణపు సుప్రీమ్‌కోర్టులో హెడ్ ఇంటర్‌ప్రిటర్‌గానుండినవారు తమఅనుభవములనుగూర్చి డైరీ వ్రాసినట్లు తేదులవారిగా వ్రాసియుంచి-పిదప అచ్చొత్తించిరి. ఇట్టిడైరీలలో అప్పుడుచూచిన సంగతినిగూర్చి అప్పటికప్పుడు కలుగు అభిప్రాయములు వ్యక్తీకరింపబడియుండును. కావున ఆవ్రాత పిదప యోచించి వ్రాయబడుదానికన్న హృద్యముగనుండును. శ్రీ వీరాస్వామయ్యగారి “కాశీయాత్ర”-తెలుగు వాఙ్మయమున ఉన్నతస్థానము వహించినదని కీ॥ శే॥ గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారివంటివారు విశేషముగ మెచ్చుకొనియున్నారు. కావున నాడైరీనుండి సంగ్రహించి మరికొన్ని విశేషముల నిందువివరముగా వ్రాయుచున్నాను. వానియందలి గుణదోషములను గుణగ్రహణ పారీణులు క్రమమున స్వీకరించియు నిరాకరించియు, ఆదరింతురుగాక యని కోరుచున్నాను.

## కాశీ క్షేత్రము

“నఃమణి కర్ణికాసమంతీర్థం
విశ్వేశ్వర సమంలింగం
నఃకాశీ సదృశీపురీ
నాస్తి బ్రహ్మాణ్డగోళకే”

అను పూర్వుల సుభాషితమును వినని హిందువు ఉండడని తలచెదను. మహమ్మదీయులకు మక్కా, క్రీస్తువులకు జెరూసలము, బౌద్ధులకు బుద్ధగయ ఎటులనో హిందువులకు శ్రీ కాశీ క్షేత్రము అటువంటిది. శ్రీ రామచంద్రాదులు గయా శ్రాద్ధమును బెట్టినట్లును, ప్రయాగలో అనేక యజ్ఞయాగాదిక్రతువులను జరిపినట్లును పురాణేతిహాసములు గలవు. హిందువులకు ఈ పుణ్యభూములను దర్శించి కడతేరవలయుననే కోరిక మాత్రమేగాక ‘కాశ్యాంతుమరణాత్ ముక్తిః’ అనువచనముననుసరించి ప్రాణప్రయాణ సమయమున కాశీక్షేత్రమునందే నివసించి మరణించవలయుననే అభిలాషయు అనేకులకు గలదు. ఈ ఉద్దేశముతో రాజులు, మహారాజులు ధనసంపత్తిగల మరిఅనేకులు ఈ కాశీక్షేత్రమున స్వగృహములను నిర్మించుకొని నివసించుచుండిరి. ధర్మాత్ములు ధర్మశాలలనుకట్టించి

యాత్రికులకును మహోపకారమును చేయుచుండిరి. సామాన్యులుకూడ వయసు చెల్లిన పిమ్మట వారణాశియందు మరణించి ముక్తినొందవలయుననే కోరికతో ఇండ్లను బాడుగకు తీసుకొని నివసించుచుండిరి. వీరికి కాలమాసన్నమగువరకు గంగాస్నానము చేయుచు విశ్వేశ్వరుని దర్శించుకొనుచు కాలమునకు యెదురుచూచుకొనుచుండిరి. కాశీయాత్ర చేయుటకు రైలు సౌకర్యములులేని కాలమున అనేకులు తమ ఆస్తులనుగురించి తగు యేర్పాటులనుచేసి బంధువులకును ఊరివార్లకును అప్పగింతలుచెప్పి కాశీకి ప్రయాణమవుచుండిరి. కాశీయాత్రానంతరము తిరుగ ఇంటికివచ్చుట సందేహముగ నెంచుచుండిరి. స్వగ్రామమునువదలి దోవలోయుండు ప్రతిగ్రామమున బసచేయుచు పాదచారులైపోవుచుండిరి. ఆకాలమున కాశీకి పోవువారిని ఆదరించి అన్నమిడుచుండిన వారుండిరి. వారిని చాల గౌరవముగ చూచుచుండిరి. యాత్రకుపోవువారు భార్యభర్తలయిన ఆదంపతులను ఆదరించి పూజించి పంపుచుండిరి. కాశీయాత్రకు పోయినవారు యాత్రనుముగించుకొని తిరిగి కొంతకాలమునకు తమ స్వదేశమునకు రాగలిగినవారినిచూచి భక్తిపూర్వకమైన ఆదరణతో వార్లకు ఆతిథ్యమిచ్చి సంతృప్తులగుచుండిరి. తిరిగి వచ్చినవారు కాశికావడిని కట్టుకొని అందులో గంగచెంబులను, సాలగ్రామములను, శంఖములను, రుద్రాక్ష దండలను స్ఫటికములను పెట్టుకొని దానిని మోసుకొనుచు వచ్చుచుండిరి. వీటిని చూచుటకు అనేకులువచ్చి వారినిదర్శించినప్పుడు వాటి మహాత్మ్యములను చెప్పుటవిని సంతసించుచుండిరి. నాచేతయుండిన ఈకొయ్యకూడ కాశినుండి తెచ్చితినని చెప్పునప్పుడందరు ఆకొయ్యనుతాకి సంతృప్తిపడేవారు. మరికొందరు వార్లనుతాకిన కాశీకిపోయిన ఫలముకలుగునని వార్లకాళ్లనుతాకి మ్రొక్కుచుండిరి. పండితులుగ నుండిన పాదపూజచేసి భోజనమిడి విశ్వేశ్వరప్రసాదమును స్వీకరించుచుండిరి. అప్పటినుండి వారిని కాశీవాసులని, ఆమెను అన్నపూర్ణాదేవియని అందరు పిలుచుచు అతిపవిత్రతగ వార్లను గౌరవించుచుండిరి. వీరుచెప్పు కాశీమజిలీలకథలను కాశీలోనివింతలు విశేషాలను శ్రద్ధగ వినుచుండిరి.

ఈ కాశీవాసులు ఇల్లుచేరినవెంటనే కాశీసమారాధనచేయు ఉద్దేశముతో భోజన పదార్థములను సేకరించుకొని బంధుమిత్రాదులను ఆహ్వానించి సుమూహూర్తమున సంతర్పణను జరుపుచుండిరి.

ఆ సంతర్పణ సమయమున కాశినుండితెచ్చిన గంగాతీర్థమును కాశివాసులు పురుషులకును అన్నపూర్ణాదేవి స్త్రీలకును పంచుచుండిరి. భోక్తలు జాస్తిగనుండిన గంగాతీర్థమున మరికొంత గంగనుకలిపి పంచుచుండిరి. భోజనమ్మునకు వచ్చినవారియిండ్లలో వ్యాధిగ్రస్తులు :ముసలివారునుండిన వార్లకు యిచ్చుటకు ఈగంగను తీసుకపోవుచుండిరి. ఊరిలో యెవరైనను చావుకు సిద్ధమైనప్పుడు గంగాతీర్థమును తీసుకొనిపోయి తులసి

దళముతోకూడ వారికంఠమున జారవిడిచెదరు. కొందరియిండ్లలోయుండు దేవతార్చన పీఠమున గంగచెంబులు తరతరములుగ నున్నవి. ఆచెంబులో గంగయుండినను లేక పోయినను పూజించుచు ఈచెంబులు మాముత్తాత, ముత్తవ్వగారు తెచ్చినవని చెప్పు కొనుచుందురు. కొందరియిండ్లలో సాలగ్రామములు, స్ఫటికములు, శంఖములువగైరాలు చాల పురాతనముగనున్నవి. వాటిని చూచినప్పుడు పెద్దలు జ్ఞాపకమునకు వచ్చుచుందురు. కొందరి ముసలివారిచేతులలో తిరుగుచుండు రుద్రాక్షమాల మాహాత్మ్యమును హెచ్చుగ చెప్పుచుందురు. ఈ రుద్రాక్షమాల పంచముఖి రుద్రాక్షమాల అనియు ఈమాలను మాముత్తాత కాశీలో చదువుచున్నప్పుడు మహాసీయుడగు యొకసన్యాసి యిచ్చినదనియు చెప్పుచుందురు. సాలగ్రామములకు, శంఖములకు, స్ఫటికములకు వేరువేరు మాహాత్మ్యములను చెప్పుచుండిరి.

## కాశీ మాహాత్మ్యం

ఇంకను సర్వశాస్త్ర పారంగతులు ప్రాచీనులునగు మహాత్ములు, మతస్థాపకులు, పండితోత్తములు అందరు ఇక్కడనే ప్రసిద్ధిచెందిన పురుషులని లోకప్రసిద్ధము.' బుద్ధ భగవానుడు లోకోత్తరమగు బౌద్ధమతమును ఇక్కడినుండియే ప్రపంచమునకు ప్రసాదించి నది. అద్వైత మతస్థాపకులగు శ్రీ శంకరాచార్యులు కాశీక్షేత్రముననే హిందూ మతమును ఉద్ధరించినది. వీరశైవులకు స్మార్తులకు శివభక్తిప్రదమైన శైవమతమును విశ్వనాధస్వామి ఇక్కడనుండియే వేలసంవత్సరములకుముందు ప్రసరింపచేసినట్లు చెప్పు కొనెదరు. వీరవైష్ణవులకు శ్రీ బిందు మాధవస్వామి క్షేత్రము మరి అనేక విష్ణుక్షేత్ర ములు ఇక్కడ స్థాపింపబడియున్నవి. మధ్వమతస్థులకు శ్రీ హనుమంతునిదేవాలయ ములు యిక్కడగలవు. మహమ్మదీయులకుకూడ ఇక్కడ గొప్ప మసీదులుగలవు. గంగాతీర మున విశ్వనాధస్వామి సన్నిధికి సమీపముననే గొప్పమసీదుగలదు. ఈవిధముగ ఈ కాశీ క్షేత్రమున అన్నిమతములవారుకూడి భజించుటకుతగిన వేరు వేరు దేవాలయములుగలవు.

" విశ్వేశ్వరం మాధవండుండిం దండపాణించ భైరవం
వందేకాశీంగుహాం గంగాం భవానీం మణికర్ణికాం"

అని ఇక్కడి విశేషములు పెద్దలచే కీర్తింపబడినవి.

మూడుకోట్ల శివలింగములమధ్య కోటిసూర్యప్రభవలె ప్రకాశించుచున్న ఈ కాశీపట్టణమున మానవుడు ఒక మూహూర్తకాలమైనను నివసించి విశ్వనాధుని దర్శించిన వారికి మరుజన్మలేకుండునని ప్రాజ్ఞులు వచింతురు. అట్టి కాశీక్షేత్రముయొక్క మాహాత్మ్యమును నేను వినుచుంటిని. చదువుచుంటిని.

నా జన్మసాఫల్యమునకు గంగాస్నానమొనర్చి రామకృష్ణాది మహనీయుల పాద ధూళి సోకిన అయోధ్య, మధుర, బృందావనం, గోకులం మొదలగు పురాతనపు పుణ్య క్షేత్రములను దర్శించి రావలయుననే కోరిక నాకు చిరకాలముగనుండెను. గాని ఈ నా కోరిక అంత సులభమైనదికాదు గనుక కొంతకాలము వేచియుండవలసివచ్చినది.

కాశీ యాత్ర

అలహాబాదులో 1910 సం॥ డిశంబరు నెలలో కాంగ్రెసు మహాసభజరిగినది. ఈ సభకు నేనును నెల్లూరినుండి పబ్లీకు ప్రాసిక్యూటరుగనుండిన శ్రీ మైదవోలు చంగయ్య పంతులుగారును, వెంకటగిరిరాజాగారి ఉన్నతపాఠశాలకు అప్పటి ప్రధానోపా ధ్యాయులు శ్రీ మాన్. ఏ. సంతాన రామయ్యంగారును, అభ్రకపుగని స్వంతదారులగు శ్రీ విస్సా లక్ష్మీనరసయ్యపంతులుగారును వెళ్లితిమి. మహాసభానంతరము అక్కడనుండి కాశీయాత్రకు వెళ్లితిమి. నేనును విస్సా లక్ష్మీనరసయ్య పంతులుగారును కుటుంబము లతో బయలు దేరితిమి.

కాశీలో తీర్థవాసియగు పుచ్చా సుబ్రహ్మణ్యశాస్త్రియింట బసచేసితిమి. వీరు పూర్వము రాజమహేంద్రవర ప్రాంతములకు చెందిన ఆంధ్రులు. ఈ తీర్థవాసులు చాల కాలమునుండి ఇక్కడనే స్థిరనివాసియై మంచి స్థిరాస్థిని సంపాదించినవారు. కొన్ని గృహములకు యజమానుడు. మమ్ముల నొక గృహమునందుంచెను. వీరి వ్యాపా రమును సాగించుటకు వీరివద్ద కొందరు గట్టివారు గుమాస్తాలుగనుండిరి. వారిలో ఒక గుమాస్తాను మాకు అప్పచెప్పిరి.

గంగా స్నా నం

మరునాడు ప్రాతఃకాలముననే గంగాస్నానమునకు బయలుదేరితిమి. విశాలాక్షి ఘట్టమునుండి మణికర్ణికాఘట్టమునకు సుమారు ముక్కాలుమైలున్నది. అక్కడికి గంగవడ్డుననే నడిచిపోవలయును. మార్గమునయుండిన ఘట్టములలో అనేకులు స్నాన మును చేయుచుండిరి. కాశీలో స్థిరవాసముగనుండువారు ప్రతిదినము మణికర్ణికా ఘట్ట ములో స్నానముచేయు ఆచారములేదు.

పర్వదినములలో మాత్రమే ఈ మణికర్ణికాఘట్టమున స్నానమును చేయుదురు. మణికర్ణికా ఘట్టమునందు స్నానముచేయు యాత్రికులు అధికముగ నుండుటవలన ఊరివా రందరు ఇతర ఘట్టములలో స్నానముచేసి విశ్వనాధుని దర్శించి ఇండ్లకు పోయెదరు. మేము నడుచుచుండు మార్గమునపోవువారు కొందరు "రాం, రాం," "హరే, హరే" యని ధ్యానమును చేయుచు పోవుచుండిరి. మరికొందరు తమ సొత్తులను మూటకట్టు కొని తలమీదపెట్టుకొని 'శివ,' 'శివ' యనుచు స్నానఘట్టమునకు నడుచుచుండిరి.

కొందరు యువకులు, యువతులు చేతులు పట్టుకొని స్నానమునకు పోవుచుండిరి. బాల బాలికలును పరుగిడుతు గంగవైపునకు పోవుచుండిరి. తాతలు అవ్వలు కఱ్ఱల నాధారము చేసుకొని తిన్నగ నడుచుచుండిరి. గ్రుడ్డివారు కుంటివారు ఇతరుల సహాయముతో గంగాస్నానమునకు వెళ్లుట చూచితిని. రెండుకాళ్లులేనివారిని వీపుమీద యెక్కించుకొని పోవుచుండిరి. అనేక దినములు తల్లిని చూడకయుండి తల్లికనుపడిన వెంటనే బిడ్డయేవిధమైన ఆతురతతో తల్లిని సమీపించుటకు పరుగెత్తునో అటులనే జనులు గంగాభవానిని సమీపించుటకు పరుగెత్తుచుండిరి.

భిక్షుకులు "బాబూ! ఏక్ పైసాదేవ్" అని యాచించుచుండిరేగాని వారు మనవెంటపడి మనలను బాధించరు. వీరుండిన స్థళమునుండి కదలరు.

గంగాస్నానం

మేము మణికర్ణికా ఘట్టమునకు చేరుసరికి 10 గంటలయినది. మమ్ములను వెంబడించిన పురోహితుని ఆజ్ఞప్రకారము అక్కడ చేయవలసిన స్నానాది కర్మకాండ నంతయు ముగించుకొంటిమి. అది డిశెంబరు మాసమగుటచే విపరీతమైన చలిగనుండెను. గంగాస్నానముచేసి గట్టునకు వచ్చులోపలనే కాయము కట్టెవలెమారినది. ఆ గంగ గట్టున కొందరు సన్యాసులు చలిమంటలను వేసుకొనుచుండిరి. స్నానముచేసినవారు చలికి తాళలేక ఆ మంటలచుట్టు కూర్చుని చలికాచుకొనుటచూచి మేమును అక్కడ చేరితిమి. కొంతసేపు అక్కడ కూర్చుని సన్యాసులకు తలఒకకానియిచ్చి బయలుదేరి విశ్వేశ్వరుని దేవాలయము ప్రవేశించితిమి.

దేవాలయమునందుండు భిక్షుకులకుగాను అక్కడ కొన్ని నాణ్యములను అమ్మెదరు. అవి అణాకు తొమ్మిది. ఒక రూపాయికి ఆ నాణ్యములను తీసుకొని లోపల ప్రవేసించితిమి. దోవలో ఇరుప్రక్కలను కూర్చుని యాచించు యాచకులకు కాసులనిచ్చుచు లోపలికి సులభముగపోతిమి. ఈ భిక్షుకులలో చాలమంది వయసుచెల్లినవారేయుండిరి. ఈ ప్రకారము భిక్షమెత్తి దినములనుగడిపి కడపట ఈ కాశీక్షేత్రముననే మరణించవలయుననే కోరికతో వీరుండినట్లు నాకు తోచినది. అనేకులు ఈశ్వరధ్యానమును చేయుచు తిరుగుచు అక్కడక్కడ మరణించువారిని గంగాతీరమునకాల్చి గంగాభవానికి అప్పగించుటకు యేర్పడిన ఒక సేవాసమితి ఇక్కడగలదు. "అనాధప్రేత సంస్కారాత్ కోటి యజ్ఞఫలంలభేత్" అనువచనమును సార్ధకపరచుటకు కొందరు ధర్మాత్ములు ఈ సమాజమును స్థాపించిరి.

ఇక్కడి భిక్షుకులు సన్మార్గులని నాకు తోచినది. భిక్షమెత్తిన ద్రవ్యమును కల్లంగడిలో ఖర్చుపెట్టువారుకాదని నాకు స్పష్టమైనది. అందువలన వీరికిచ్చు దానము

సత్పాత్రియుందుంచినాను - అనే మనశ్శాంతిగల్గినది. అందువల్లనే "పాత్రమెరిగి దానం గోత్రమెరిగి వివాహము" చేయుమని పెద్దలు చెప్పిరి.

## విశ్వనాధుని క్షేత్రము

కాశీనగరము ఆదిలో ఒక మట్టిదిబ్బగ నుండినట్లును విశ్వనాధస్వామి బ్రహ్మ హత్యకు భయపడి ఈ ప్రదేశమున వెలిసినట్లును స్థళపురాణముగలదు. మొదట ఇక్కడ ఉండినది. శ్రీ ఆదినారాయణుడని ప్రమాణముగలదు. ఈ నగర ప్రకృతి ఆకృతి అసహ్యముగను, గజిబిజిగను కనుపించును. సందుగొందులు కలిగిన మార్గములను కలిగి యుండును. మూడునాలుగు అంతస్థుల మేడలనుగలిగి సూర్యకిరణముల కడ్డువడు చుండును. ఇందువలన పట్టణము పరిశుభ్రముగ నుండదు. ఈ అపరిశుభ్రమైన సందుగొందులలోనుండి విశ్వనాధ క్షేత్రమునకు పోవుమార్గముండెను. ఈ మార్గ మధ్యమున గొప్ప గోమాతలు విచ్చలవిడిగ సంచరించుచుండెను. వాటిని చూచి నప్పుడు మనకు భయముగనుండినను అవి మనజోలికిరావు. వాటిని యాత్రికులు మేపుటవలన బలిసి తిరుగుచుండును.

ఈ విశ్వనాధ క్షేత్రము చెప్పతగినంత ఆడంబరముగ లేదు. అయితే ఆ దేవాల యమును ప్రవేశించగనే మానవుని మనస్సునకుకలుగు ఆనందమును చెప్పనలవికానిది. ఒక చిన్నగర్భగుడిలో వెలసియున్న నిరాడంబరమగు శివలింగమును జాతిమత భేదములు లేక రాత్రింబవలు పూజించు క్షేత్రము మరియెక్కడనులేదు. స్వామిని పూజించు ప్రత్యేక పూజారిలేడు. వస్త్రాభరణములు సున్న. నీ వేజాతివని ప్రశ్నించు వారెవరును అక్కడలేరు. డబ్బులడుగు అర్చకుడులేడు. అయితే బిల్వార్చన, గంగాభిషేకములనుసదా భక్తులు స్వంతముగ జరుపుచుందురు. మహాత్ముకలిగిన మహాత్ములు యెప్పుడును నిరాడంబ రముగనేయుందురనే న్యాయమును మనము ఇక్కడ గ్రహించవలయును. రాత్రియెప్పుడూ నిర్జనసమయమున గర్భాలయమును మాత్రము శుభ్రపరచుచుండువారుండెదరు.

ఈ విశ్వనాధుని దేవాలయమును దర్శించినవారు అనేక విషయములను గ్రహిం చుటకు అవకాశముగలదు. దేవుడు భక్తిని కోరునుగాని పట్టువస్త్రములను ఆభరణము లను కోరడు. అట్లుండినను కొన్ని దేవాలయములలో జనులు దేవునకు వెలగల నగలను పట్టు పీతాంబరములను సమర్పించి సంతోషించెదరు. వాటిని కాపాడుటకు ఇనుప తలుపులతో గర్భగుడినిమూసి భద్రపరచెదరు. ఇంత భద్రముగ నుండినను దొంగలు గుడిలోదూరి స్వామి సొమ్ములను అపహరించుచుండుట ప్రతిదినమును మనము వినుచునే యున్నాము. ఈ స్వామికి నగలులేవు. తలుపులులేవు. దిగంబరస్వామి. మొదటి నాడు గంగాస్నానమును స్వామి దర్శనమును ముగించుకొని ఇల్లుచేరి భుజించి పరుంటిమి.

గృహలక్ష్మి

మరునాడు మరల గంగాస్నానము, విశ్వేశ్వరుని దర్శనముచేసిన అనంతరము ఊరు చూచుటకు బయలుదేరితిమి. అద్దరిన యుండిన కాశీమహారాజు నగళ్లను చూచుటకు పడవమీదపోయి చూచితిమి. ఆపడవమీదనే గంగానదిలో కొంతదూరము ప్రయాణము చేసితిమి. ఆ నాడు పండువెన్నెలరాత్రి. ఆకాశమంతయు ధవళచ్ఛాయతో ప్రకాశించుచుండెను. ఆ నిర్మలమైన గంగాతీరముననూ పడవపోవుచున్నప్పుడు గట్టునయున్న గొప్ప మేడలలోనుండివచ్చు వీణా గాన మాధుర్యము మా వీనులకు విందొనర్చుచుండెను. గంగాతీరమున పెరిగియుండిన పూదోటలనుండి వచ్చుచుండు సౌరభ్యమనుభవించుటకు ఆ నాడుమాకు ప్రాప్తికలిగినందులకు సంతోషించుచుంటిమి. ఆ సమయమున అనేకులు పడవలనెక్కి గంగ గర్భమున విహరించు దృశ్యము కనులు పండువుగ నుండెను. స్వామిదర్శనము, గంగాస్నానముకంటే ఈనాటి నావయాత్ర మనోహరముగ నుండెను. ఈ నాడు నాకు కలిగిన ఆనందమును నేనెట్లు మరువగలను?

మూడవనాడు ఉదయముననే కాలకృత్యములను దీర్చుకొని కర్మకాండ ముగించుకొని బయలుదేరితిమి. గంగాతీరముననున్న హరిశ్చంద్రఘట్టం, అశీఘట్టం, మాధవఘట్టం, రామేశ్వరఘట్టం, కేదారఘట్టం, మణికర్ణికాఘట్టం మొదలగు ఘట్టములలో స్నానము చేయుటకు ఒకచిన్నబోటును యేర్పాటుచేసుకొనిపోతిమి. ఇంత దూరముననున్న కాశీక్షేత్రమునకు వచ్చినవారు అన్ని ఘట్టములలోను స్నానముచేసిననే పుణ్యము లభించునని తీర్థవాసులు చెప్పిరి. అయితే ఈ కూడావచ్చిన పురోహితుడు మా వద్దవుండిన డబ్బంతయు ముగియువరకు కర్మకాండనుండి మమ్ములను విడువలేదు. ఈ పట్టణమున మూలమూలలోను శివలింగములున్నవి. పెద్ద పెద్ద భవనములయెదుట లింగప్రతిష్ఠలుగలవు. ఊరంతయు శివమయముగనే కనుపడినది. ఈ దినముననే భోజనానంతరము బయలుదేరి కాశీలోయున్న ఇతర పుణ్యక్షేత్రములనుకూడ దర్శించితిమి. సాయంకాలము విశాలాక్షీ దేవాలయమునకుపోయి అర్చనాదిపూజలను సలిపి ఆ రోజునకు కార్యక్రమము ముగించుకొంటిమి.

## కాశీలో వ్యభిచార స్త్రీలు

నేను ఇంతవరకు కాశీక్షేత్ర మాహాత్మ్యమునువ్రాసి పిమ్మట అక్కడి వ్యభిచార స్త్రీలనుగురించి వ్రాయవలసివచ్చినందులకు చాల చింతించుచున్నాను. ఈ మహత్తర మాహాత్మ్యముగల మహాక్షేత్రమందుకూడ ఒక నల్లటి మచ్చగలదు. నేను బసచేసిన తీర్థవాసులు గుమాస్తాను తోడుతీసుకొని ఆ పట్టణమందుండు దివ్యక్షేత్రములనేగాక అనేకస్థలములను కాశీలోప్రసిద్ధిచెందిన పట్టుపీతాంబరాదుల అంగళ్లను, పాత్రసామానుల విక్రయించు దుకాణములను చూచితిని. అప్పటికి సుమారు సాయంత్రము 6 గంట

లైనవి. ఇకను మనము ఇంటికి వెళ్లవలసినదేనా లేక యింకేమైన యిక్కడ చూడదగిన విశేషములు యేమైనను నున్నవా? యని వారిని అడిగితిని. అప్పుడాయన ఇక్కడ ఒకప్రసిద్ధమైన వేశ్యలుండు పెద్దవీధిగలదని నీళ్లునములుతు మెల్లగ నాతో చెప్పెను. నేనొక్కడనే ఆదినమున వారితో కూడ పోతిని గనుక అదికూడ చూచెదమురమ్మని ఆవీధికిపోతిమి. అక్కడికి మేముపోయిన సమయము కనుచీకటిపడుచుండెను. ఆవీధి యిరుప్రక్కలను గొప్ప గొప్ప 3 లేక 4 అంతస్థుల భవనములుండెను. మేము ఆ వీధిని ప్రవేశించగనే అక్కడ సుగంధపరిమళముల ఆనందమును అనుభవించితిమి. అక్కడక్కడ వీణాగానమును హిందూస్థానీ సంగీతములును, తపల, నృత్యముల శబ్దములను వినుచు ఆవీధిలో నడుచుచుంటిమి. వారాంగనలు వయ్యారముగ వరాండాలలో నిలబడి వీధిని నడుచుచుండు యువకులను వారగంటచూచి చిరునవ్వులతో వారిని ఆహ్వానించుచుండిరి. ఈవీధి చాలపొడుగైనది గనుక మేము అంతదూరము నడువలేక కొంతదూరమే పోయి ఇంటికి మరలితిమి. నాతో కూడవచ్చిన తీర్థవాసి గుమాస్తా ఈవూరిలో యుండు మంచిశబ్బరలను చక్కగ గుర్తెరిగినవాడు గనుక వార్లనుగురించిన ఈక్రింద నేనువ్రాసిన 'కథలను నాతో చెప్పెను.

ఈ పడుపు వృత్తివ్యాపారస్తులు కొందరు దేవదాసీలనబడు వేశ్యస్త్రీలు. కాశీ పట్టణముననుండు ద్రవ్యమదాంధులు ఈదాసీలకు దాసానుదాసులై యున్నారు. ఇక్కడే దివ్యభవనములను నిర్మించుకొనియున్న రాజాధిరాజులవద్దనువీరు అప్పుడప్పుడుపోయి ఆటపాటలను జరిపి వార్లను సంతోషపెట్టి మిక్కిలిరొక్కముల నందుచుందురు. వీరు మొదటి తెగవారు. రెండవ తెగవారు అత్తమామల పోరుపడజాలక ఇల్లువిడచి పరుగెత్తి వచ్చినవారును, కారణాంతరములవలన భార్యాభర్తలకు పొందుకుదరక ఇల్లువిడిచివచ్చిన వారును, ఇంక నిట్టివారందరు ఈవీధిని నివసించుచుందురు. మూడవ తెగవారు:— బాల్యవివాహములవలన అనాథలయి, సనాతనధర్మ ప్రవర్తనలకు దూరులయి తలిదండ్రాదుల కఠినశిక్షలకు తాళజాలక ఇల్లువిడచి కడపట కాశీక్షేత్రమే గత్యంతరము అనివచ్చి చేరినవారుకూడ ఈవీధియందున గలరు.

మరియు నాల్గవ తెగవారు-భర్తలను పోగొట్టుకొని ప్రపంచసుఖముల నపేక్షించి పురుషులవలలో చిక్కుకొని సంఘదౌర్జన్యమునకు భయపడి కాశీక్షేత్రమునకువచ్చి వైద్యాలయములలో ప్రసవింతురు. వారు తాముకన్న శిశువులనందే విడిచివచ్చిన ఆవైద్యాలయాధికారులు ఆశిశువులను అనాథ శరణాలయములకు అప్పగించెదరు. అట్టి ఆడబిడ్డలను ఈ వీధినయుండు వ్యభిచారస్త్రీలు డబ్బిచ్చి తీసుకొనివచ్చి పెంచి పెద్దచేసి ఈవృత్తిలోదించగా ఆవిధమున జీవించువారును ఈవీధిలోనున్నారు. ఈవిధముగ ఈ వీధివ్యాపారము దినదినాభివృద్ధి గాంచుచున్నది. మనదేశపటమునవున్న ఈనల్లటి మచ్చ తెల్లబడితేగాని మనము చల్లబడము. (సశేషము)

మరునాడు మరల గంగాస్నానము, విశ్వేశ్వరుని దర్శనముచేసిన అనంతరము ఊరు చూచుటకు బయలుదేరితిమి. అద్దరిన యుండిన కాశీమహారాజు నగళ్లను చూచుటకు పడవమీదపోయి చూచితిమి. ఆపడవమీదనే గంగానదిలో కొంతదూరము ప్రయాణము చేసితిమి. ఆ నాడు పండువెన్నెలరాత్రి. ఆకాశమంతయు ధవళచ్ఛాయతో ప్రకాశించుచుండెను. ఆ నిర్మలమైన గంగాతీరముననూ పడవపోవుచున్నప్పుడు గట్టునయున్న గొప్ప మేడలలోనుండివచ్చు వీణా గాన మాధుర్యము మా వీనులకు విందొనర్చుచుండెను. గంగాతీరమున పెరిగియుండిన పూదోటలనుండి వచ్చుచుండు సౌరభ్యమనుభవించుటకు ఆ నాడుమాకు ప్రాప్తికలిగినందులకు సంతోషించుచుంటిమి. ఆ సమయమున అనేకులు పడవలనెక్కి గంగ గర్భమున విహరించు దృశ్యము కనులు పండువుగ నుండెను. స్వామిదర్శనము, గంగాస్నానముకంటే ఈనాటి నావయాత్ర మనోహరముగ నుండెను. ఈ నాడు నాకు కలిగిన ఆనందమును నేనెట్లు మరువగలను?

మూడవనాడు ఉదయముననే కాలకృత్యములను దీర్చుకొని కర్మకాండ ముగించుకొని బయలుదేరితిమి. గంగాతీరముననున్న హరిశ్చంద్రఘట్టం, అశీఘట్టం, మాధవఘట్టం, రామేశ్వరఘట్టం, కేదారఘట్టం, మణికర్ణికాఘట్టం మొదలగు ఘట్టములలో స్నానము చేయుటకు ఒకచిన్నబోటును యేర్పాటుచేసుకొనిపోతిమి. ఇంత దూరముననున్న కాశీక్షేత్రమునకు వచ్చినవారు అన్ని ఘట్టములలోను స్నానముచేసిననే పుణ్యము లభించునని తీర్థవాసులు చెప్పిరి. అయితే ఈ కూడావచ్చిన పురోహితుడు మా వద్దవుండిన డబ్బంతయు ముగియువరకు కర్మకాండనుండి మమ్ములను విడువలేదు. ఈ పట్టణమున మూలమూలలోను శివలింగములున్నవి. పెద్ద పెద్ద భవనములయెదుట లింగప్రతిష్ఠలుగలవు. ఊరంతయు శివమయముగనే కనుపడినది. ఈ దినముననే భోజనానంతరము బయలుదేరి కాశీలోయున్న ఇతర పుణ్యక్షేత్రములనుకూడ దర్శించితిమి. సాయంకాలము విశాలాక్షీ దేవాలయమునకుపోయి అర్చనాదిపూజలను సలిపి ఆ రోజునకు కార్యక్రమము ముగించుకొంటిమి.

## కాశీలో వ్యభిచార స్త్రీలు

నేను ఇంతవరకు కాశీక్షేత్ర మాహాత్మ్యమును వ్రాసి పిమ్మట అక్కడి వ్యభిచార స్త్రీలనుగురించి వ్రాయవలసివచ్చినందులకు చాల చింతించుచున్నాను. ఈ మహత్తర మాహాత్మ్యముగల మహాక్షేత్రమందుకూడ ఒక నల్లటి మచ్చగలదు. నేను బసచేసిన తీర్థవాసులు గుమాస్తాను తోడుతీసుకొని ఆ పట్టణమందుండు దివ్యక్షేత్రములనేగాక అనేకస్థళములను కాశీలోప్రసిద్ధిచెందిన పట్టుపీతాంబరాదుల అంగళ్లను, పాత్రసామానుల విక్రయించు దుకాణములను చూచితిని. అప్పటికి సుమారు సాయంత్రము 6 గంట

లైనవి. ఇకను మనము ఇంటికి వెళ్లవలసినదేనా లేక యింకేమైన యిక్కడ చూడదగిన విశేషములు యేమైనను నున్నవా? యని వారిని అడిగితిని. అప్పుడాయన ఇక్కడ ఒకప్రసిద్ధమైన వేశ్యలుండు పెద్దవీధిగలదని నిర్లక్ష్యముగ నవ్వుచు మెల్లగ నాతో చెప్పెను. నేనొక్కడనే ఆదినమున వారితోకూడ పోతిని గనుక అదికూడ చూచెదమురమ్మని ఆవీధికిపోతిమి. అక్కడికి మేముపోయిన సమయము కనుచీకటిపడుచుండెను. ఆవీధి యిరుప్రక్కలను గొప్ప గొప్ప 3 లేక 4 అంతస్తుల భవనములుండెను. మేము ఆ వీధిన ప్రవేశించగనే అక్కడ సుగంధపరిమళముల ఆనందమును అనుభవించితిమి. అక్కడక్కడ వీణాగానమును హిందూస్థానీ సంగీతములును, తపల, నృత్యముల శబ్దములను వినుచు ఆవీధిలో నడుచుచుంటిమి. వారాంగనలు వయ్యారముగ వరాండాలలో నిలబడి వీధిన నడుచుచుండు యువకులను వారగంటచూచి చిరునవ్వులతో వారిని ఆహ్వానించుచుండిరి. ఈవీధి చాలపొడుగైనది గనుక మేము అంతదూరము నడువలేక కొంతదూరమే పోయి ఇంటికి మరలితిమి. నాతోకూడవచ్చిన తీర్థవాసి గుమాస్తా ఈవూరిలోయుండు మంచిశబ్బరలను చక్కగ గుర్తెరిగినవాడు గనుక వార్లనుగురించిన ఈక్రింద నేనువ్రాసిన కథలను నాతోచెప్పెను.

ఈ పడుపు వృత్తివ్యాపారస్థులు కొందరు దేవదాసీలనబడు వేశ్యస్త్రీలు. కాశీ పట్టణముననుండు ద్రవ్యమదాంధులు ఈదాసీలకు దాసానుదాసులై యున్నారు. ఇక్కడే దివ్యభవనములను నిర్మించుకొనియున్న రాజాధిరాజులవద్దనువీరు అప్పుడప్పుడుపోయి ఆటపాటలను జరిపి వార్లను సంతోషపెట్టి మిక్కిలిరొక్కముల నందుచుందురు. వీరు మొదటితెగవారు. రెండవతెగవారు అత్తమామల పోరుపడజాలక ఇల్లువిడచి పరుగెత్తి వచ్చినవారును, కారణాంతరములవలన భార్యాభర్తలకు పొందుకుదరక ఇల్లువిడిచివచ్చిన వారును, ఇంక నిట్టివారందరు ఈవీధిన నివసించుచుందురు. మూడవతెగవారు:— బాల్యవివాహములవలన అనాథలయి, సనాతనధర్మ ప్రవర్తనలకు దూరులయి తలిదండ్రాదుల కఠినశిక్షలకు తాళజాలక ఇల్లువిడచి కడపటకాశీక్షేత్రమే గత్యంతరము అనివచ్చి చేరినవారుకూడ ఈవీధియందున గలరు.

మరియు నాల్గవతెగవారు-భర్తలను పోగొట్టుకొని ప్రపంచసుఖముల నపేక్షించి పురుషులవలలలో చిక్కుకొని సంఘదౌర్జన్యమునకు భయపడి కాశీక్షేత్రమునకువచ్చి వైద్యాలయములలో ప్రసవింతురు. వారు తాముకన్న శిశువులనందే విడిచివచ్చిన ఆవైద్యాలయాధికారులు ఆశిశువులను అనాథ శరణాలయములకు అప్పగించెదరు. అట్టి ఆడబిడ్డలను ఈ వీధినయుండు వ్యభిచారస్త్రీలు డబ్బిచ్చి తీసుకొనివచ్చి పెంచి పెద్దచేసి ఈవృత్తిలోదించగా ఆవిధమున జీవించువారును ఈవీధిలోనున్నారు. ఈవిధముగ ఈ వీధివ్యాపారము దినదినాభివృద్ధి గాంచుచున్నది. మనదేశపటమునవున్న ఈనల్లటి మచ్చ తెల్లబడితేగాని మనము చల్లబడము. (సశేషము)



## బీరకాయ ముప్వంకాయవలె కూరచేయు విధము

బీరకాయలు లేతవి చెక్కుతీసిన తరువాత, నాలుగుపక్షాలుగా, తరిగేది, పచ్చిశనగపప్పు కాయలను బట్టిచూచుకుని యెండుమిరపకాయలు వేసి నెయ్యివేసి వేయించుకోవాలి. ఎండుకొబ్బరికోరు కొంచెము వేయించిగాని పచ్చిది గాని వేసి ఈపప్పు ఇవన్నీ రోట్లోవేసి పొడిచేయాలి. ఆ సేటప్పుడు కొంచెము జీలకర్రవేసి కొట్టితీసుకుని ఈతరిగిన కాయల్లోకూరి పొయ్యిమీద బాణలివేసి నెయ్యివేసి ఈకాయలను, వేల్చాలి. తరువాత సన్నమంట వుండాలి; మూతపెట్టాలి. కొంచెంసేపైన తరువాత మూతతీసేయాలి. గరిటెతో కాయలను తిప్పాలి. ఇక నామూత అవసరములేదు. ఎర్రగావేగాక దించిభోజనానికి వుపయోగించితేచాలా రుచిగా వుండును. బీరకాయలో సారమేమీ పోదు. సాధారణముగా బీరకాయకూర ముక్కలలో ఉప్పువేసి పిండి ఆనీళ్లుపార పోసేస్తారు కొందరు. ఆనీళ్ళలో షనుముంటుంది. అదిమనవొంటికి పుష్టినిచ్చేది. పైమోస్తరుగా చేసుకుంటే నీళ్లుపోకుండా ఆరోగ్యముగాను రుచిగాను వుంటుంది.

## దూటపులిహోర చేయువిధము

అరటి దూటలేతది సన్నగాపెరుగులో వేసేమాదిరిగా తరిగిపెట్టుకోవాలి. అల్లం పచ్చిమిరపముక్కలు సన్నగా తరిగిపెట్టుకుని పొయ్యిమీద కళాయివున్నపాత్రగాని అల్యూమినింపాత్రగాని కాలవేసి నాలుగు మిళ్లిగరిటెలు నూనెవేసి ఎండుమిరప ముక్కలు మినప్పప్పు చెంచాడు ఆవాలువేసి కరివేపాకు ఇంగువ అల్లం మిరపముక్కలు వేసివేగాక, ఈదూటముక్కలు వేయాలి. వుప్పు పసుపువేసి రెండునిముషములు మూతపెట్టి వుంచాలి. తరువాత మూతతీసి వేయాలి. బాగాకలియబెట్టి దించివేసి నిమ్మకాయరసము కావలసినంత చూచి పిండాలి. ఇష్టమైనవాళ్లు, కొద్దిగా నువ్వులపొడి వేసుకోవచ్చును. చాలా రుచిగా వుండును. టీ. కాఫీ వేళల్లో ఫలహారాలకు బాగుంటుంది. భోజనంల్లో కూడా తినవచ్చును చాల రుచిగావుంటుంది, రెండు దినాలు నిలువ ఉంటుంది. సాధారణముగా కూర, పచ్చడి చేస్తే దాంట్లోనీళ్లు పోతాయిగాని ఇలాచేస్తే నీళ్లు పోకుండా ఆరోగ్యముగా వుంటుంది.

ముల్లంగి కూడా పైమోస్తరుగా చేయవచ్చును. చాల బాగుంటుంది.

## క్యాబేజీ వేసి గారెలు చేసేవిధము

మంచి మినపపప్పు రెండు అళాకులు నానబోసి బాగా నానిన తరువాత మెత్తగా రుబ్బాలి. క్యాబేజీ 5 ఫలాలు తెచ్చి సన్నగా తరిగి ఆరుబ్బిన పిండిలోవేసి, అల్లం, పచ్చిమిరపముక్కలు, కొత్తిమిరి ఇష్టమైతే నాలువుల్లిపాయలు కూడ ముక్కలుగా తరిగివేసి గారెలుగా చేసి నేతిలోగాని డాల్డాలో గాని వేసి ఎర్రగా వేగాక తింటే చాలా రుచిగావుండును. ఒంటికి పుష్టినిచ్చును. ఆరోగ్యకరముగా నుండును. పప్పు కూడా ఆట్టేఖర్చు తగ్గుతుంది.

మనముచేసే వంటలలో తెనుగుదేశంలో కూడా తూర్పు విశాఖపట్నం విజయనగరం వంటలు వేరుగా వుంటాయి. ప్రతీదాంట్లో బెల్లమువాడుతారు. కొండవీటిసీమ (అంటే) గుంటూరు జిల్లావారు, ఎక్కువగా కారము వేసిచేస్తారు. అది అంతరుచికరమైనదిగా వుండదు.(?) అరవవారి వంటలు కొన్ని కొన్ని బాగానే వుంటాయి, ముఖ్యముగా చారు, సాంబారు, పెరుగు పచ్చళ్లు బాగుంటాయి. కారముకూడా తగుమాత్రముగా

వాడుతారు. అసలు ఏవంటకైనా సువాసన రుచి కలిగించేందుకు కొన్ని రసవర్గములను చేర్చివేయించిగాని లేక పచ్చివిగాని పొడిచేసి పెట్టుకోవాలి. ఆపొడిని కొందరు ఎప్పటి కప్పుడు చేసుకుంటారుగాని మనకు తొందరగా వంటచేయాలంటే అప్పటి కప్పుడు చేయడం కష్టముగా వుంటుంది. ఈపొడిని గురించే మన ఆంధ్రకవి శ్రీనాథుడు కూడా ఈపద్యములో వర్ణించాడు.

''మిరియము లేనికూరయును
మెప్పు నెరుంగని వారి ఈవియున్
కరకరగాని భోజనము కన్నులపండువుగాని రూపమున్
సరసుల కింపుకావు ....'' అన్నాడు.

మిరియము అంటే కొన్ని రసవర్గములను పచ్చివిగాని వేయించిగాని నూరి వేసేదన్న మాట. ఏఏకూరకు, పచ్చళ్ళకు, పులుసుకు ఏమేమి వేయాలో తెలుసుకొని అలాగే వంటచేస్తే రుచికరముగాను వొంటికి ఆరోగ్య కరముగాను వుంటుంది. జీర్ణశక్తి కలుగుతుంది కూడా. మనసోదరీమణులు నేర్చుకోవడం చాలా ముఖ్యము.

టి. వెంకటలక్ష్మమ్మ

## కత్తిరింపులు (లేక) బిస్కట్లు

గోధుమపిండి లేక ½ వీశ మైదాపిండిలో శనగపిండి $\frac{1}{8}$ వీశనువేసి, పంచదార $\frac{1}{4}$ వీశను చేర్చి సరిపడునన్ని కొబ్బరినీళ్ళతో ముద్దఅగునట్లు కలుపవలెను. కొద్దిగా చిన్నచెంచాడు సోడాఉప్పునువేసి, పైనకొద్దిగా నెయ్యి కూడావేసి బాగుగా మర్దించవలెను. ఒకగంట అలావుంచి పీటపైన పెద్ద అప్పడములవలెచేసి, హార్లిక్సు సీసా మూతతో బిళ్ళలవలె కోసుకొని, వాటిని నేతిలోకాని డాల్డాలోకాని వేయించిన చాలా రుచిగా నుండును. ఎన్నిరోజులైనా కరకర లాడుతూ కమ్మగానుండును. ఆరోగ్యానికి బలానికి చాలా ప్రశస్తము.

కె. సత్యవతమ్మ

**మినుముల చింతపండు పచ్చడి:** పొట్టుతీసిన మినపపప్పు మనకుకావలసినంత తీసిపెట్టుకొనవలెను. దానికి తగినంత ఆవాలు, కొద్దిగా యింగువ, మెంతులు తీసుకొనవలెను. మొదట బాణలియందు మంచి నూనె కొద్దిగాపోసి అందు మెంతులు యింగువ వేగనిచ్చి మినపపప్పుపోయవలెను. పప్పుసగము వేగిన పిమ్మట పప్పునకు తగినంత ఎండు మిరపకాయలు ఆవాలు పోసి బాగుగా వేగిన పిమ్మట దించి కొద్దిగా ఉప్పును అందులోవేసి వుంచవలెను. నూరునప్పుడు ముందు బండపై పిసుతీసిన చింతపండు పప్పునకు తగినంత ముందుగా నానబెట్టవలెను. చింతపండు, ఉప్పు, వేయించుకున్న మిరపకాయలు మెత్తగానూరిన పిమ్మట పప్పు, ఆవాలు, మెంతులు, ఇంగువ అందులోవేసి పప్పుసగము మెదగువరకు నూరి తీసుకొనవలెను, ఇందులో ఇష్టమున్న యెడల పచ్చికొబ్బరి తురిమి కడపట పచ్చడిలో వేసికొద్దిగానూరి తీసుకొనవలెను.

**ఒండపచ్చడి:** మనకు కావలసినంత పొట్టుతీసిన పెసరపప్పును తీసుకొని కడగవలయును. పప్పునకుతగినంత ఉప్పు, ఎండుమిరపకాయలు కొద్దిగ ఇంగువ, జీలకఱ్ఱవేసి మెత్తగనూరితీసుకొనవలెను. దీనిలోవాడు పదార్థములన్నీ పచ్చివే. మనకు తొందరగా కావలసినప్పుడు దీనిని చేసుకోవచ్చును.

సర్వేపల్లి లీలావతి

# బ్రతుకు తెరువు



కూరపొడులు, సాంబారుపొడి, చారుపొడి, అన్నంలోపొడి, లేక కమ్మపొడియని ఆంధ్ర దేశమున గృహిణులు పలుమారు తమతమ యిండ్లలో తయారు చేసుకొను చుందురు. కాని భద్రముగానుంచుకొనుటకు సదుపాయములు తెలియక వానిలోని మంచి వాసనలు త్వరలోపోగా పారపోయుచుందురు. వీనిని వేయించుట, కలుపుట అంత మందికి చేతనైయుండదు. పలుమారు చెడిననూ, మాడిపోయిననూ, కలుపువిధానముల యందు ముందు వెనుకలయిననూ ప్రతిరోజు తయారొనర్చుకొను పాకములు చెడి రుచి హీనములైయుండును. ఇట్టి మసాలాపొడులు తయారుగానుండుటవల్లనే హోటల్సువారు త్వరగా వంట చేయుటలో నేర్పరులైయున్నారు. వారు వాని రుచిని సర్వదా వకే తీరున వుంచినవారున్నూ అగుచున్నారు. వీటిని మార్కెట్టునకు యెక్కించి వ్యాపారములు సాగించిన మంచి లాభముండును.

పలువురు ఆమోదించిన సక్ర విధానములనిందు పొందుపరచుచున్నాము.

**కూరపొడి :** ధనియాలు 1 శేరు. ఇష్టమున్నవారు తెల్లపాయలు 2½ పలములను పొట్టువల్చి శుభ్రముచేసినవి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఎండు మిరపకాయల మెత్తనిపొడి | 2½ | పలములు | మెంతులు | 1 | పలము |
| మెత్తగాకొట్టిన పసపు | 1 | ,, | ఆవాలు | 1 | ,, |
| మిరియాలుపొడి | ½ | ,, | ఉప్పు | 2½ | ,, |
| జీలకర్ర | ½ | ,, | | | |

గాని, ఇందులో యెవరికి యే పదార్థముయొక్క రుచి అధికముగా కావలయునో అట్లు చేర్చుకోవచ్చును. ఇందులో రుచికొరకు ఇంగువను వేయించి పొడిచేసికూడ చేర్చుకోవచ్చును.

(బియ్యపుపిండి: కొందరు బియ్యమును వేయించి పిండి విసిరి కూరల మీద చల్లుటకు జాగ్రత్త పరుచుకొనెదరు. ఇట్టి పిండి కూరలు ఉడికిన పిమ్మట చల్లిననీరు పీల్చుకొని వేపుడు కూరలవలెనేయుండును.)

చేయుట:-ధనియాలు, ఆవాలు, మెంతులు, మిరపకాయలను ప్రత్యేకప్రత్యేకముగా వేయించవలయును. ముదర వేయించరాదు. మాడిపోరాదు దంచుటకు వీలగునట్టి వేడి కల్గిన చాలును. అప్పుడు రోటిలోపోసి మెత్తగా దంచవలయును. తర్వాత పసుపును ఉల్లిపాయలతో కూడ దంచి చేర్చవలయును. పిమ్మట సీసాలోగాని, తిసివేయనట్టి ఎనామల్ డబ్బాలలోగానిపోసి సాంబార్ పౌడరు, లేక మసలాపౌడరు అని చీట్లువ్రాసి తగు ఖరీదుకూడ వేయవచ్చును.

ఆర్థిక పరిస్థితు లలవడినందున, నాగరికత హెచ్చినందున, విద్యావంతురాండ్రై, వీలులేక, సమయము దొరకక పాశ్చాత్యులవలె బజారు వెంటబడి ఆహార పదార్థములు, ఉపాహార పదార్థములు కొనుటయేగాక యితరులకుకూడ బ్రతుకుతెరువు మార్గము చూపుచున్నారుగాన పరిజ్ఞానము, పరిశుభ్రత, పదార్థ జ్ఞానము గలవారందరు ధనికు లగుటకు యిది మంచి సమయము.

# ఇంటిపనులలో మెళుకువలు



ఈ రెండవ సంచిక (ఫిబ్రవరి) తరువాయి

ఆడపిల్లలకు చదువెందుకనే తల్లులు ఈ కాలంలో లేరు. ఆ మాట ఇంకా నీకేకోశాన్నైనా ఉంటే మరిచిపో.

♦ ♦ ♦

ఆడపిల్లలకున్నూ మగపిల్లకాయలకువలెనే చదువడం, వ్రాయడం, లెఖ్ఖలు ముఖ్యంగా రావాలి. అందుచేత కనీసం ఆ మాత్రమైనా, నీ కూతురికి చదువు చెప్పించడం నీ విధి. నీకు ఇంట్లోపనికి చేతికి అడ్డం వస్తున్నదిగదా అని దాని భవిష్యత్తు పాడుచేయకు.

♦ ♦ ♦

ఇప్పుడు సామాన్యంగా అన్ని పత్రికల్లోనూ వ్యావహారిక భాషలోనే వ్రాతలు వ్రాస్తున్నారు. పుస్తకాలూ అట్లే వ్రాస్తున్నారు. తీరిక వేళల నీ బిడ్డ ఇంట్లో ఉన్నప్పుడు ఏ పత్రికైనా పుస్తకమైనా చదివించుకొనివిను. వింటుంటే - బిడ్డ ఎక్కడ తప్పు చదువుతున్నది నీకే తెలుస్తుంది. సరిదిద్దవచ్చు. బిడ్డ కథలో ఏ పట్టైనా అర్థంగాక నిన్నడుగుతుంది. నీవు దానికి విడమరచి చెప్పవచ్చు. నీవేదైనాపని చేసుకుంటూనే నీ బిడ్డకు ఉపాధ్యాయినివి కాగలవు.

♦ ♦ ♦

నీకు తీరికలేకపోవచ్చు; వ్రాత అలవాటులేకపోవచ్చు. కాని నీ ఊహాపోహలకు లోటున్నదా? ఏ కూర తరుక్కుంటూనో, ఏ అన్నం వండుకుంటూనో - ఒక చిన్న కథ, ఒక తమాషా, ఒక నీతిబోధ - చెప్పి నీ కుమార్తెచేత వ్రాయించు. మళ్లీ చదివించుకో. అమ్మాయి ఎక్కడ తప్పువ్రాసింది నీకే తెలుస్తుంది. దిద్దు. చక్కగా నీ పేర "గృహలక్ష్మి"కి పంపు.

♦ ♦ ♦

ఏ రోజు పెట్టిన చిల్లర ఖర్చు ఆ రోజు అమ్మాయిచేత కాగితముమీద వ్రాయించియుంచు. ఏ రోజుకారోజు మొత్తంచేసి నీ దగ్గర నిలవ చూచుకో. దీనివల్ల నీ బిడ్డకు రూపాయ లణాలు పైసలు కూడడం తీసివేయుడం వస్తుంది. ఇట్లే అవసరంకొద్దీ భాగహారం, హెచ్చవేతం కూడా వచ్చేస్తాయి. నీ బిడ్డకు బళ్లో చెప్పే చదువుకు ఇంటివద్ద ఇట్టి తర్ఫీదు దోహద మవుతుంది.

♦ ♦ ♦

నీ బిడ్డకు సంగీతం మాస్టరును పెట్టి సరిగమపదనిసలు చెప్పించడానికి నీ భర్తకు దార్ఢ్యంలేకపోవచ్చు. కాని ఆ అమ్మాయి నెమ్మతిగా అర్థగాంభీర్య ముట్టిపడేట్టు పద్యం చల్లగా శ్రావ్యంగా చదివేట్లు నీవు చేయవచ్చు. ఇందుకుగాను రోజూ అమ్మాయిచేత భాగవతమో, భారతమో, మరేదైనా కావ్యమో- నాలుగు పద్యాలు చదివించివిను. చదివేటప్పుడు ఆ బిడ్డ వైఖరి చక్కదిద్దు.

♦ ♦ ♦

ఇందుకు వేమనశతకం, సుమతిశతకం, కుమారీశతకం ఇలాంటి సులభమైన శతకాలతో ప్రారంభించవచ్చు. నీ బిడ్డ రోజుకు ఒక్క పద్యమైనా కంఠపాఠంచేసేట్లు చూచావంటే - సంవత్సరానికి కనీసం 300 పద్యాలైనా వస్తాయి. దానివల్ల శబ్దజ్ఞానం, అర్థజ్ఞానం, స్పష్టమైన ఉచ్చారణ అలవడుతుంది. పెద్దలు బోధించిన నీతి నియమాలు లేతహృదయంలో చక్కగా హత్తుకొంటాయి.

వయసువచ్చేకొద్దీ, నైషధంలోను, ఆముక్తమాల్యదలోను, పారిజాతాపహరణంలోను, విరాట పర్వములోను మేలైనఘట్టాలు భావముట్టిపడచదివే నేర్పు నీబిడ్డకు కలుగుతుంది.

♦ ♦ ♦

నీబిడ్డ ఊహాపోహలు ఎట్లా ఎదుగుతున్నవి అనేది నీవుగమనిస్తుండాలి. ఊహాశక్తి పెంపొందడానికి నీవు దోహదంచేయాలి. ఏదైనా ఒకకథ సగంచదివించి-ఆపిదప ఏమైఉంటుందో ఊహించమనాలి. పిదప చదివించాలి. ఇట్లాచేస్తుంటే బిడ్డకు ఊహించడమనేశక్తి క్రమంగా వృద్ధిపొందుతుంది.

♦ ♦ ♦

నీకొమార్తెకు సకాలంలో వండడం వార్చడం మొదలైన పాకకళకూడా నేర్పాలి. పాకకళ అంటే ఊరికె వండి వార్చడంకాదు. అందులో నేర్పు, ఓర్పు తెలియాలి.

♦ ♦ ♦

ఏ కూర ఎట్లా తరగాలి; ఏది ఎట్లా వండాలి; దేనికి నీళ్లు పిడిచేయాలి; దేనికి నీళ్లు ఇగిరించాలి. దేనికి పులుసు వేయాలి; దేనికి పిండి బెల్లం పెట్టాలి. ఎల్లాంటి కూరలకు ఆవచేరిస్తే రుచి. ఏఏ కూరలలో కొబ్బరి తురుము చేరిస్తే కమ్మదనము. ఇట్టివన్నీ పాకకళా రహస్యములలో సూక్ష్మాతి సూక్ష్మాలు. కడకు ఏకాయ, ఏదుంప, ఏఆకు ఎట్లా తరగాలి; ఎంతెంత ముక్కగా తరగాలి అనేదికూడా ఒక హంశమే. ఇవన్నీ ముందు నీవు తెలిసి, నీ బిడ్డకు నేర్పాలి.

(సశేషము)




(1948 నవంబరు సంచికలో వివరింపబడిన శిశువ్యాధులకు సులభచికిత్సలు.)

16. నులిపురుగులు:- వీనినే కొందరు పొట్టపాములనియు ఎలికపిల్లలనియు చెప్పుటకలదు. ఇవి సామాన్యముగా మధురపదార్థములు, పిండితో చేయువంటకములు తినుటవల్ల కలుగును. పిల్లలకు పండ్లువచ్చుకాలమున పాలకాయలనియు, దొంతర్లనియు నొకవిధమగు తినుబండారములను చేసియిచ్చుట అలవాటుకలదు. సామాన్యముగ నిది ధనవంతులు, మధ్యతరగతివారు, 'చేయుదురు. ఇక పేదవారియింటి బిడ్డలో? అప్పుడప్పుడే వచ్చుచున్న పండ్లదురదతీర గోడన నేలనమట్టి బెడ్డలను వలుచుకొనితిందురు. ఇట్టి అభక్ష్యపదార్థములవల్ల పిల్లల ఆరోగ్యముచెడును. జీర్ణశక్తి నశించును. వ్యాధినిరోధకశక్తియు తరుగును. పొట్టలో క్రిమివ్యాధులు అంకురించును.

అట్టి క్రిములు (పురుగులు) నాలుగువిధములయియుండును: (1) వలుచని పురుగులు (Tape worms) (2) గుండుపురుగులు (Round worms) (3) దారమువంటి పురుగులు (Thread worms) (4) కొంకిపురుగులు (Hook worms). క్రిమిసిద్ధాంతము ఇంకను పెక్కురూపములుదాల్చి అభివృద్ధిలోనికి వచ్చుచున్నది.

పిల్లలకుమాత్రము తల్లియే గృహమందు వైద్యురాలు. జాగ్రత్తగలతల్లి బిడ్డయొక్క మలమాత్రములపై దృష్టినిల్పి-అందలి గుణదోషముల నరయుచు తన్నివారణోపాయముల సరిగావించుచుండును. పిల్లలుగాని పెద్దలుగాని వ్యాధిగ్రస్తులైనప్పుడు వైద్యులు- ఎన్నిసార్లు అల్పాచమానమైనది, ఎన్నిసార్లు అధికాచమానమైనది, వానిరంగు, వాసన, హెచ్చుతక్కువలు, మొదలైనవన్నియు అడుగుచుందురు. కాకితముప్రాసి పెట్టుమందురు. ఆసుపత్రులలోను అట్టలపై కాకితములంటించి దానిపై వ్రాసియుంతురు. తెలివిగలతల్లి, పట్టిరోజులలోను వీనిని వ్రాసిపెట్టియుంచును. దానివల్ల యేమాత్రమువైపరీత్యము

కలిగినను: తల్లికనుక్కోగలదు. వెంటనే అనుభవముగల ముసలమ్మలనుగాని, తగినవైద్యునిగాని సంప్రతించి తగిన ఔషధోపచారములచే తన్నివారణ ఒడయుచుండును.

ఈవ్యాధి జనించినచో పెక్కుతప్పుదోవలేర్పడి వైద్యులనే తారుమారుచేయును. వారువ్రాసియిచ్చిన మందులనువాడిన కొన్నివ్యాధులకు సరిపోవును; కొన్నివ్యాధులకు సరిపోవు. సాంటోనైన్ ఈవ్యాధికి తగు ఔషధమని ఈకాలములో తెలియని పట్టణవాసులుండబోరు.

పల్లెటి గ్రామములవారికి సరిపడిన తగుఔషధములు వారికిని సులభముగనే లభ్యమగుచున్నవి. గ్రామవైద్యములో సమస్తమైనవారికి ఉపకరించు స్వల్పచికిత్సలును గలవు

1 మాచిపత్రి: దొడ్లలోను పూలతోట్లలోనువేసి పెంచుచుందురు. దాని ఆకును ఒకగుప్పెడు తీసుకొని సళసళకాగునీటిలోవేసి 5 నిమిషములు మరుగనిచ్చి చల్లార్చి వడబోసి తడవకు ½ ఔన్సు చొప్పున రోజుకు రెండుపర్యాయములిచ్చిన కడుపులోనున్న పాములు మలమువెంట పడిపోగలవు.

2 మంచిగుమ్మడికాయ మనకందరికి తెలియును. గుమ్మడిగింజలను తినుటకు బిడ్డలకు ఇష్టము. పప్పులనుతీసినములుటకు ఇచ్చినచో ఔషధముగ పరిణమించి కడుపులో పాములు మలవిసర్జనకు ముందుగాని వెనుకగాని పడిపోవును.

3 మోదుగుమాడలోని పప్పునూరి సుమారు శనగగింజంత ప్రమాణములు మాత్రలుగట్టి రోజుకు రెండుపర్యాయము లిచ్చినను గుణమిచ్చును.

4 వాయువిడంగములు, నాగకేసరములు, వాము, కురాసానివాము, వేప ఈనెలలో నేర్పుకొలది ఔషధములుగ వాడుకొనవచ్చును.

ఇట్టిపిల్లలకు ఉప్పు అధికముగ వాడవలయును. తీపి విశేషించివాడకూడదు.

17 కర్పాణి:- బిడ్డలకు చేతులమీదను, అరచేతులయందును, పాదములమీదను, మోకాళ్లక్రిందను కురుపులు, పల్లికలు సన్ననిగుల్లలు లేచును. తలమీదను మాడుపైనకూడ లేచుచుండును. కొంతకాలమువరకు ఏమి రాచినను మానవు; మానినను మరల అంకురించును.

ఇందులకు మంచిగంధపు పొట్టుకాల్చి మశిచేయవలయును. తగినంత జీలకర్రను నిమ్మకాయరసముతోనూరి మంచిగంధపుపొట్టు మసిచేర్చి కొబ్బరినూనెతో కల్పి రాచిన నిశ్చయముగ నెమ్మదియగును.

# గృహలక్ష్మికి పద్యరత్నాలు

కల్లూరు అహోబలరావుగారు

(మే, సంచిక తరువాత)

సీమంతము సేతురు, నీ కోమాన్యవతీ లలామ! కోమలులెల్లన్
నీమాత యింటఁ గూడుచు శ్రీ మంగళములను పాడి శ్రీ గృహలక్ష్మీ!

క్రొత్తగు కోకలు సొమ్ములు అత్తరుఁ బన్నీరు మధురమగు పుష్పములన్
బిత్తరి, నీ కిత్తురు; నీ చిత్తం బిగురెత్తుచుండ శ్రీ గృహలక్ష్మీ!

పసుపుం గుంకుమములతోఁ బసదనముల, శోభనముల భాసిల్లెదు; సొం
పెసలారు పిండివంటలు ముసలమ్మలు వెట్టుచుంద్రుబో; గృహలక్ష్మీ!

ఎది వలసిన, నద్దానిని మదవతిరో! తినఁగఁజేసి మక్కువగ నివ్వం
గ దలచుచుందురు; గర్భిణుల దలఁపుఁ దీర్పంగఁ జెల్లు లలి గృహలక్ష్మీ!

చక్కిలములు, ముచ్చారలు సక్కెరపోళీ జిలేబి జహగీర్లడ్డుల్
మెక్కువగాఁదినఁ బోకుము మక్కువతో, మితమువలయు; మా గృహలక్ష్మీ!

ఎంతగ దరిద్రులైనను కాంతా! తలిదండ్రులెపుడు గనఁజేయరు నీ
కింతేనిలోటు పాటులఁ; జింతింపకు తక్కువంచు శ్రీ గృహలక్ష్మీ!

సంసార కష్టసుఖములు హింసలు యావత్ప్రపంచమెల్ల నొకండే;
హంసగమన! యోచింపు; మహింసను, పాటింపఁ జనుసుమీ! గృహలక్ష్మీ!

నెల లుబుకు కొలఁదిఁ గ్రమముగ వెలదీ! యంగాంగ వితతి వేడుక హెచ్చన్
కళ, కాంతి నిండ, నిండిన నెలవలె శోభిల్లెదీవు! నిజ గృహలక్ష్మీ!

శోభాయమానముగ, నో శోభావతి! రంభలీల శుభకళలొప్పన్
శోభించుచుండ నిన్గని శోభితుఁడగు నీదు ప్రియుఁడు; శుభ గృహలక్ష్మీ!

నీ పలుకులు, నీ చింతలు యేవగిదిని నున్న, నట్టివే చిహ్నంబుల్
రూపించు నీకుపుట్టెడి పాపకు నీ తత్త్వమెఱుగవా! గృహలక్ష్మీ!

కోపము, దురహంకారము, పాపపు చింతలు నసూయభావం, బుబ్బున్
రూపాదఁజేసి, చక్కని పావనిఁ గనవమ్మనీవు; వరగృహలక్ష్మీ!

శాంత మహింసయు, నోర్పును చింతలు లేకున్కి, శ్రీశుఁ జిత్తములోనన్
మంతనము సేయు భావము కాంతరో! నీకుండవలయు; ఘనగృహలక్ష్మీ!

తల్లిగుణంబులె బిడ్డకుఁ జెల్లునుబో యంచుఁ బ్రజలుసెప్పెదరు, శ్రీ
ఫుల్లాబ్జాక్షి! తలంచియు సల్లలిత గుణంబుగనుము; జయగృహలక్ష్మీ!

కడుపు బరువంచు నూరక ముడుచుకఁ గూర్చుంటగాదు; ముగుదరో! కష్టం
బిడనట్టి చిన్నిపనులను విడువకఁ జేయంగవలయు; ప్రియగృహలక్ష్మీ!

బరువుల నెత్తుట దించుట సరిగా దలసటలు గ్రమ్మ జాఱును గర్భం
బు రమాలలామ! మెలకువ లరసియు మెలగంగ శుభములగు; గృహలక్ష్మీ!

చేతనగు పనుల నల్లనఁ బ్రీతింగావింపవలయు వెలదీమణి! నీ
మాతకు సహాయపడుము; సనాతనుల స్మరింపుమమ్మ; జయగృహలక్ష్మీ!

రాత్రుల టాకీల్గాంచియు గాత్రంబలసటలు గ్రమ్మఁ గాయకు నిదురల్
మైత్రాణ తగ్గ, రోగము మిత్రత్వము, సలిపికొనుసుమీ; గృహలక్ష్మీ!

కర్మేంద్రియములు మొదలుగ మర్మాంగంబుల శుచిత్వమహిమఁ దెలిసియున్
నిర్మలస్నానము సలుపుము ధర్మమతిం దేవు దలఁచఁ దగు; గృహలక్ష్మీ!

కట్టగవలయును శుభ్రపు బట్టలనే సతము నీవు; పరిశుభ్రతయే
నెట్టన నీ యారోగ్యము గట్టిపఱచు దిట్టముగను-ఘనగృహలక్ష్మీ!

టీ కాఫీ, కోకోలను గైకొనకు సతంబునీవు కాంతామణి! నీ
యాకలియు దప్పిదీఱదు పోకును రోగములు నిజముసుమి గృహలక్ష్మీ!

కమ్మని వెచ్చని భోజన మమ్మా! నీహితముకొద్ది హాయిగఁ దిని, నీ
రమ్ముల దప్పికిఁ గ్రోలుము కొమ్మరో! విశ్రాంతిఁ దీసికో; గృహలక్ష్మీ!

సోడా లైమా రెంజుల వాడకు రుచికరములంచు వనరుహనయనా!
వేడిదినంబుల మజ్జిగ వాడుము; నీకొసఁగు శాంతి వరగృహలక్ష్మీ!

మజ్జిగఁబోలెడి మందులు ముజ్జగముల లేదటంచు పూర్వపు పెద్దల్
యొజ్జలయు బోధసలిపిరి లజ్జావతి! తెలియవమ్మ; లలి గృహలక్ష్మీ!

## గృహలక్ష్మికి పద్యరత్నములు



తినవలదు చలిదియన్నము; గొనవచ్చును మంచిపండ్లు కోరిభుజింపన్ ;
ఘనమైన పదార్థంబులఁ దినిన నటుగఁ జాలవమ్మ ; ధీగృహలక్ష్మీ!

మంచి పడంతులఁ జేరుము గొంచెపు స్త్రీగోష్ఠివదలికొని, సత్కథలన్
సంచిత పాపంబులఁ విదళించి, యశశ్శ్రీ గొనుము లలిన్; గృహలక్ష్మీ !

దైవమును నమ్మియుండుము కావు నతండెల్లవారిఁ గరుణామయుఁడై
నీ విధి నెరవేర్చును; మాతా ! వంతలు వీడవమ్మ తమి; గృహలక్ష్మీ !

తొమ్మిది మాసమ్ముల, కాలమ్మొక క్షణమువలెగడచి, లలనరో! శ్రీమూ
ర్తమ్మున, శుభదమ్ముగ, ప్రసవమ్ము గనెద వీవు తల్లి ! వరగృహలక్ష్మీ!

ప్రసవము దైవాధీనము ప్రసూతిజము సహజమమ్మ పడతులకెల్లన్ ;
ప్రసవము గాంచిన వెంటనె ప్రసన్నహృదయవగుదీవు; వరగృహలక్ష్మీ !

తలిదండ్రు లత్తమామలు చెలులున్ దోబుట్టు లెల్లచేడెలు నీకున్
గలిగిన కొడుకును గాంచియు చెలువముతో మురియుచుండ్రు; శ్రీ గృహలక్ష్మీ !

చాలాల వగుచుఁ గడపిన కాలంబది గడచినేడు కాంతామణిరో !
బాలెంత రాలవైతివి; బాలకు, సుకుమారు గనుచు వరగృహలక్ష్మీ !

(సశేషము)

# ఆడంబరజీవి : నిరాడంబరజీవి

రకరకములయిన రంగులనుపయోగించి రమణీయములయిన చిత్రాలు గీయడంలో అతను సిద్ధహస్తుడు. ప్రజలంతా అతని చిత్రకళానైపుణ్యాన్ని చూచి మురిసిపోయేవారు. అతని చిత్రాలలోని భావసంపదను గ్రహించి వారంతా తన్మయులయేవారు. ముఖ్యంగా ప్రకృతిదృశ్యాలను చిత్రించడంలో అతనికి అసమాన ప్రతిభవుందని వినికిడి.

అతను తన చిత్రాలను తుచ్ఛమైన డబ్బుకోసం అమ్మడు. ఏదో దయామయులయిన ఆవూరివారందు భుక్తికి సాధారణంగా అతనికి కొరవలేదు. తనచిత్రాలనుచూచి యితరులు ఆనందించారంటే, అంతే చాలు. అంతకన్న ఎక్కువ తనకు కావల్సిందేముంది ?

ఒకరోజు ప్రకృతిదృశ్యాలను తిలకిస్తూ అతను వూరివెలుపల చెరువు దగ్గరకెళ్లాడు. ఇసుకతిన్నెమీద కూచోని పడమట అస్తమిస్తున్న బంగరువన్నె సూర్యునిచూస్తూ వివిధములయిన భావపరంపరలను లోనగు తున్నాడు. ఇంతలో గాజులచప్పుడువిని తుళ్లిపడ్డాడు.

ఎవరది ? ఒక కాపపడుచు. బిందె చేతబట్టుకొని చెరువుకడకొచ్చింది. హఠాత్తుగా మన చిత్రకారుని కళ్లు ఆమెపైకి దూకాయి......ఆమెలో అదోవిధమయిన పరివర్తన అంకురించింది...క్రీగంటిచూపుతో ఆమె చిత్రకారుణ్ని అవలోకించింది...అన్యోన్యప్రేమ ఆక్షణమే మొలకెత్తింది.

ఓశుభముహూర్తాన దేవాలయంలో దైవసాన్నిధ్యంలో ఆప్రణయమూర్తులిద్దరికీ వివాహం జరిగింది. పెండ్లికూతురు తల్లిదండ్రులకు వీడ్కోలుచెప్పి భర్తతోబాటు అత్తవారింటికి బయల్దేరింది.

"ప్రియా! నేను బీదవాణ్నని నీకుతెలుసుగా. అంచేత పెండ్లిబహుమతు లివ్వడానికి నాకు సామర్థ్యంలేదు. మనంవుండబోయేది ఓవూరికొంప. అయినా మనలో ఒకరిహృదయం ఒకరికి తెలుసు. జీవితం కులాసాగానే దొర్లిపోతుంది" అన్నాడు చిత్రకారుడు.

అవునన్నట్లు ఆకాపుపడుచు ఒక్కచిరునవ్వు నవ్వింది. చిత్రకారుని హృదయంలో ఆరాటం సమసి పోయింది. అతను సంతుష్టిచెందాడు.

రాళ్లు రప్పలు, ముండ్ల పొదలు, కాలవలు, సెలయేళ్లు...ఇవన్నీ దాటుకుంటూ చేయి చేయి కలుపుకొని పయనము సాగించా రాదంపతులు. తమాషాకబుర్లు చెప్పుకుంటూ వాళ్లిద్దరూ చాలా దూరం సాగిపోయారు.

"అవిగో పెద్ద పెద్దసౌధాలు ..వాటిల్లో గొప్ప గొప్ప ధనికులుంటారు" అని వేలితో చూపించాడు చిత్రకారుడు. ధనికులు ఎలాగు జీవితంగడుపుతారో చూద్దాం పద అంటూ అతను తనచిన్నారి పొన్నారిని తోడ్కొని ఆభవనాలవైపు దారితీశాడు.

ఆకాశాన్నంటే ఆసౌధాల రమణీయాన్ని క్రోలుతూ సరసంగా మాటాడుకుంటూ వాళ్లిద్దరూ కొంతదూరం సాగిపోయారు. ఇంతలో మంచి అందమైన భవనంఒకటి కన్పించింది. ఇది అంతకు ముందటి భవనాలన్నింటిలోకీ ఎత్తయిందీ, రమణీయమైంది కూడాను.

చిత్రకారుడు గేటుతీసి ఆభవనం ఆవరణంలోకి వెళ్లాడు. మారుమాటడకుండా ఆకాపుపడుచుకూడా అతణ్ని అనుసరించింది...వాళ్లు పోయేదోవలో ఎటుజూచినా రమ్యములైన పుష్పాలు తమపరిమళాన్ని వెదజల్లడమేకాకుండా ఆప్రదేశానికి వింత శోభనిస్తున్నాయ్.

గృహలక్ష్మి

## ఆడంబరజీవి : నిరాడంబరజీవి

చిత్రకారుడు భార్యతోపాటు మెట్లెక్కి ఆభవనంలోకి దారితీశాడు. ఎందరెందరో మనుషులొచ్చి "ఎన్నాళ్లకు తాముదర్శనమిచ్చింది" అంటూ అతనికి నమస్కరించారు. తనభర్తకేమిటి వీళ్లు నమస్కరించడమేమిటని ఆకాపుపడుచు అచ్చెరువొందింది.

ఈ వింత పరిస్థితులనుగురించి ఆలోచించడానికి కూడా ఆమెకు అవకాశంలేకపోయింది. ఎంచేతనంటే భర్త తనను అతిరమణీయములయిన గదులలోకి లాగుకొనిపోతూంటే వాటి అందచందాల నవలోకించడంలోనే ఆమె నిమగ్నురాలైంది. వేరు ఆలోచనలకు ఆమెమనసులో ప్రస్తుతంతావులేదు.

ఇద్దరూ బహుశోభతో అలంకరింపబడ్డ గదిలో అడుగుపెట్టారు. చిత్రకారుడు సోఫాలోకూచొని ప్రక్కన కూచోమని భార్యకు చెప్పాడు దిగ్భ్రమజెందుతూ. ఆమెకూడా సోఫాలోకూలబడింది.

చిత్రకారుడొక్క నవ్వునవ్వి భార్యనుదగ్గరికి లాక్కొని చెప్పాడు: "ఈభవనంమనిద్దరిదే" ..... ఆ యమాయకపు పల్లెపడుచుకు ఇదంతా అగమ్యగోచరంగా వుండింది......భర్త అంతా విప్పిచెప్పాడు.

తాను ఆ ప్రదేశపు జమీందారుననీ చిత్రకళాసేవకై పల్లెటూళ్లో అజ్ఞాతవాసం చేశాననీ ఆమెకు తెలియజేశాడు. చిరునగవు ఆ పల్లెపడుచు ముఖంలో తాండవించింది. చిత్రకారుడు ఆప్రేమమూర్తిని హృదయానికి హత్తుకున్నాడు...నీలవర్ణములా ప్రణయమూర్తుల నావరించాయి.

ఇంతపెద్ద సౌధంలోకూడా ఏదోకొరతగా వున్నట్లు ఆకాపుపడుచుకు తోచింది. ఆమె హృదయంలో అసంతృప్తి ప్రబలింది. నిరాడంబరజీవిఅయిన ఆమెకు ఈఆడంబరజీవనం రుచింపలేదు. 'శాంతియుతమైన నిరాడంబర జీవనంలో వుండేమాధుర్యం ధనిక జీవితంలో లేదని యామె యంతరాత్మనొక్కి వక్కాణించింది.

కాలచక్రం గిర్రున తిరిగింది. తనచాతనయినంత వరకూ యీ కొత్తవాతావరణానికి అనుగుణ్యంగా నడుచుకొని దానికలవాటు పడటానికి ఆ పల్లెపడుచు విశ్వప్రయత్నాలు చేశేది. తన పరిచారికలనెవరినీ పల్లెత్తు మాటయినా అనకుండా వారిని మాతృప్రేమతో కాపాడుతూ వారిప్రేమకు పాత్రురాలైంది. ఎవరుబట్టినా ఈమెమంచి గృహిణి అనేవారే!

అయినా......జీవితంసుఖంగా దొర్లిపోతున్నా ఆవిడ హృదయంలో అసంతృప్తి మాత్రం నిలిచిపోయింది ఈ యాడంబర జీవనమంటే ఆమెకసహ్యం వేసింది. ఈ హృదయారాటంతో ఆమె మంచంపట్టి దినదినానికి క్షీణించడం మొదలిడింది.

'అయ్యో! అతను ఆ బీద చిత్రకారుడుగనే వుంటే ఎంతబావుండేది' అని పలుమారు విలపించేది ఆసాధ్వి.

కొన్నినెలలకల్లా ఆమెచెల్లుకుంది భర్తను దుఃఖసాగరంలో ముంచేసి. అప్పుడు తెలుసుకోగలిగాడు ఆమె ఎందుకు బాధపడ్డదీ. శాంతియుతమైన నిరాడంబర జీవనం కోసం ఆమె వాచిపోయిందని అప్పుడు తెల్సుకున్నాడు చిత్రకారుడు.

ఆరోజు......పెండ్లినాడు ఆమెధరించిన గౌనును — బీదవాళ్లు ధరించేగౌనును—ధరింపజేయించి సమాధి చేయించాడతను.

అలాగయినా ఆమె ఆత్మశాంతిస్తుందని అతని దృఢవిశ్వాసం.

("టెన్నిసన్" వ్రాసిన ఆంగ్లపద్యం చదివి)

చెరుకుమూడి రాధాకృష్ణమూర్తి.

# పరమపతివ్రత శారద

శ్రీమతి కళాసత్యవతీదేవిగారు



ఆమె పరమసాధ్వీమతల్లి యగు శ్రీ శారదాదేవి. భరతజాతికి తలమానికంబు. శ్రీరామకృష్ణపరమహంస సహధర్మచారిణి. ఆదర్శయోగినీమణి. కల్లకపటములెరుగని ముగ్ధాంగన. ఆటపాటలలో మైమరచియుండెడి చిరుతప్రాయముననే శారద తనహృదయ నాథుని మనఃపద్మముపై నాసీనునిగావించి పూజలర్పించెడిది. చిన్నతనముననే ధ్యానమా తల్లికి బాల్యక్రీడ యయ్యెను. పతిభక్తిఆమె జీవితసౌరభము. తననాథుఁడు పరమభాగవ తోత్తముఁడని శారదబాల్యముననే గ్రహించెను. పతితనయెడ చూపుప్రేమానురాగ ములకామె పరమానందమొందెడిది. ఆమె మాతృహృదయము వాత్సల్యభరితమై శిష్యులశ్రేయమున కెంతయు పరితపించెడిది. జగద్విఖ్యాతిగాంచిన శ్రీ రామకృష్ణమఠ ముల కామెయేమూలము. భగవన్మాతృభావమును వెదజల్లుట కవతరించిన విశ్వేశ్వరి యై విరాజిల్లె నాశారదామాత! ఆయమ 'మాతృదేవి' అను గౌరవనామమున ప్రసిద్ధి గాంచెను. ఆమె ప్రేమ సానుభూతు లనుపమానములు.

దక్షిణేశ్వరమున పరమహంస కాళికాలయమున నర్చకుడుగా నుండెను. ఇరుగు పొరుగు కాంతలు తనభర్తకు పిచ్చియెక్కినదని చెప్పుకొనుమాటలు శారదవిన్నది. భర్తకుసేవలుచేయుట తనపరమధర్మమని గ్రహించినది. తానుపుట్టింట నుండుట తగ దనుకొన్నది. భర్తసన్నిధి కరిగినది. పరమహంస సాదరపూర్వకముగా శారదను గ్రహించెను.

నవనవోన్మేష యౌవన సౌందర్యమున సాక్షాద్రతీదేవివలె నొప్పుచుండిన శారద నాథునికామోపభోగములవైపు నాకర్షింపక పరమసాధ్వియై నాథుని పారమార్థికౌన్నత్య మున కెంతయుఁ దోడ్పడినది. తనభర్త సాక్షాత్పరమేశ్వరుడనుభావముతో నారాధించినది. రుచికరములైన పదార్థము లమర్చి ప్రియునిమానసమును తన ప్రియభాషణములచే నలరించుచు శారద నాథునికి భోజనమిడి సంతుష్టుని గావించెడిది.

శారదాదేవి పరమహంసచే షోడశీపూజయందు సాక్షాత్పరమేశ్వరీ స్వరూపముగా పూజింపబడెను. ఆమెను రామకృష్ణుఁడు "ఏమమ్మా" అనియేకాని 'ఏమే' అని యెన్నడు పిలిచియెరుగడు; కటువైనపొక్కమాటైన ఆమెననలేదు. సతీమణిమనోభావములను అభి రుచులను గమనించుచు పరమహంస శారదను ప్రేమతోనాదరించువాడు. స్త్రీజనార్హమైన నగలయందామె కభిరుచికలదని గ్రహించి రూ 300 లు పెట్టి చక్కనినగలు చేయించెను. భర్తచేనిన్నింట మన్ననలందిన శారదనిజముగాధన్యురాలు!

పరమహంస సిద్ధిపొందిన వెనుక ఆమె యోగినీమణియై తీర్థయాత్రలు గావించెను. ఆసమయమందామె యెందరెందరకో మంత్రోపదేశము చేసెను. గురుదేవుడు శారదకు సదా ప్రత్యక్షదైవమయ్యెను. గురుదేవుని రూపపట మలంకరించుట, తాను భుజించు నాహారము నాథునికి నైవేద్యమిడుట, పిమ్మట నాతనిని విశ్రమింప జేయుట ఆమె దైనికాచారములు. అంధప్రాయముగ పురుషుల ననుకరింపరాదనియు స్త్రీలు నిక్కముగా గృహలక్ష్ములై వెలయవలయుననియు నామె అభిలషించెను. ఈ ఆదర్శమాత శారదాదేవి సం. 65 లు జీవించి బ్రహ్మనిర్వాణ మొందెను. మాతృదేవిని గన్న భరతమాత నిజముగా ధన్యురాలు కదా!

---



# రీటా తలవెండ్రుకలను పెంచును

రీటా కుదుళ్ళకు బలమునిచ్చి నిగనిగలాడు నిడుపాటివెండ్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్. తలవెండ్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేనుకొరుకు ఇంకను తలవెండ్రుకలకు సంబంధించిన సమస్తవ్యాధులకు రీటా అమోఘముగ పనిచేయును. వేనకువేలువాడి గుణమును పొందియున్నారు. మీరుకూడా నేటినుండియే రీటావాడుడు.

## హిందీ, ఆంధ్ర, తమిళ, కన్నడ తారల ప్రశంసలు

**లలితాపావర్ :** ఉత్తమమైన హెయిర్టానిక్ కోరేవారికి రీటాకు మించినది మరేదీలేదు. దానిని వాడితే వారు మనమాతృభూమి అనేక శ్రేష్ఠమైన వస్తువులను ఉత్పత్తి చేయగలదని గ్రహించుకోగలుగుతారు.

**సుశీల్కుమార్ :** రీటా శిరోజాల వృద్ధికి మిక్కిలి సంతృప్తికరమైన సాధనం. శిరోజాలు రాలిపోతున్నపుడు నివారణకు, బుద్ధినైర్మల్యానికి ఎల్లరూ ఎప్పుడూ రీటానే వాడాలని సిఫారసు చేస్తున్నాను.

**కన్నాంబ :** రీటా నాకు పరిపూర్ణమైన తృప్తికలిగించినదని తెలుపుటకు మిక్కిలి సంతోషముగానున్నది. అది నిజముగా అమోఘమైనది.

**పుష్పవల్లి :** నాకు సుమారు ఏడాదిగా తలవెంట్రుకలు రాలిపోతున్నవి. రీటా వాడినప్పటినుండియు, తలవెంట్రుకలు రాలుట తగ్గింది. ఇది చాల శ్రేష్టమైన హెయిర్టానిక్ అని నా అభిప్రాయము.

**సూర్యకుమారి:** రీటా మంచి సువాసనకలిగి, వాడినవారికి ఎంతో చల్లదనమును చేకూర్చును. ఇకమీదట ఎల్లప్పుడు రీటానే వాడవలయునని నేను ఒక నిశ్చయమునకు వచ్చితిని.

**కృష్ణవేణి:** రీటా చక్కని సువాసనగలిగి, మనస్సునకు ఆహ్లాదాన్ని కలిగిస్తుంది. తలవెంట్రుకలను రాలకుండాచేసి, కొత్త వెంట్రుకలను పెంచుటకు రీటా సాటిలేని హెయిర్ టానిక్.

**ఆర్. పద్మ:** నా ముఖసౌందర్యమును పెంపొందించే శిరోజాలకు రీటాయే కారణము. స్వల్పకాలములోనే రీటా అద్భుతముగ గుణము నిచ్చినది.

**లక్ష్మీబాయి:** తలవెండ్రుకలను పెంచుటకు రీటా అమోఘముగ పనిచేసినది.

**వసుంధరాదేవి:** శిరోజాలు దీర్ఘంగా నిగనిగలాడుతూ ఎదగడానికి, శిరోజరక్షణకు రీటా అమోఘమైనదిగ రుజువైనది.

**రాజమ్మ :** శిరోజ సంబంధమైన బాధల నివారణకు రీటా అమోఘమైనది. గుర్తించుకున్నాను. శిరోజవృద్ధికి, రక్షణకు ముఖ్యమైన వస్తువులు రీటాలోవున్నవి. దీర్ఘ వినీలకుంతలాలు ఆశించే మహిళలందరూ దీనినే వాడాలి.

# రీటా హెయిర్ టానిక్




సృష్టియందు స్త్రీపురుష భేదముతో ప్రతిజీవిని బ్రహ్మ ద్వివిధంబుగ సృష్టించుచున్నాడు. అందులో పురుషులకు ధైర్యసాహసములు, స్త్రీలకు, లజ్జ, సౌకుమార్యము, మధురవాక్కు, దయాస్వభావము మున్నగు కొన్ని సహజాలంకారముల నొసగియున్నాడు. ఇందుచేతనే ప్రబంధకవులు తమగ్రంథములందు స్త్రీలకు కాంతాలలామ, చిగురుబోడి, కీరవాణి, మరాళగమన, ధవళాయతాక్షి మున్నగు విశేషణములను వాడుచు వారిసహజాలంకారములను చాటుచుందురు. ఇవి సామాన్యముగ నగ్రజాతిస్త్రీలయందే గమనించెదము కాని, నిమ్నజాతిస్త్రీలను గమనించము. ఇట్టి సౌకుమార్యాదియలంకారములు ప్రతి స్త్రీయందును కాన్పించును. కాని వారివారి యలవాట్లనుబట్టి కొన్ని మార్పుపడును.

మఱియు మనవారు అలంకారము లనగ సువర్ణమయములగు నాభూషణములనే యలంకారములని నుడువుదురు. అంతియ కాదు. ఆరోగ్యమునకు, ఆనందమునకు. ఆకర్షణకుజేయు పరికరమంతయు నలంకారముక్రిందనే గణింపవచ్చును. ఇవన్నియు కల్గిననాడే, చిత్తశాంతి, హృదయానందము మున్నగునవికల్గి జీవయాత్రను సక్రమముగ నడుపగలము.

కొందఱీ యలంకారములు పూర్వకాలమున లేవనియు నివియన్నియు నేటికాలపు నవనాగరికత యనియు జెప్పెదరు. బాల్యమునుండియు తల్లిదండ్రులు ఆడుబిడ్డపుట్టిన దాదిగ నామెకెన్నో యలంకారముల జేయవలయునని యాశించుచు స్నానము, మైపూత, కాటుక, మున్నగు యలంకారముల జేయుచు చక్కని దుస్తులనుదొడుగుట యలవాటైయున్నది. ఈ యలంకారములు శుభప్రదములేకాక నారోగ్యదాయకములై కూడ నున్నవి.

పసుపు-మంగళదాయకమేకాక శరీరమునకుబూసిన గజ్జి మున్నగు చర్మవ్యాధులను నశింపజేయును.

స్నానము-ఇది శరీరమున పట్టినమురికిని పోగొట్టి ఒకవిధమగు మార్దవము కలుగజేసి హాయినిగూర్చి, శరీరమును పెంపొందించును. శిశువులు పాలు నీళ్లతోడనేకదా పెరుగుదురు.

మైపూత-ఇదికూడ శరీరమున గజ్జి మున్నగునవి రాకుండ జేయును.

బొట్టు-ఇయ్యది ముఖమునకు కళనొప్పించుటయేకాక మెదడునకు సంబంధించిన నరములు చెదరకుండ నొక్కచో గూర్చును. అందుచేతనే మనపెద్దలు స్నానమైనపిదప మగవారిలోకూడ బొట్టును పెట్టుకొందురు.

కాటుక-ఇది కండ్లలో దుర్మాంసమును పెరుగనీయక నిరాటంకమైన దృష్టిని ప్రసరింపజేయునని చంటిబిడ్డలకుగూడ నుపయోగింతురు.

తలనూనె-ఇది పూయకున్నచో శిరోజములు చిక్కుపడి జడలుకట్టుటయేకాక మార్దవమును వీడిరాలిపోవుట తటస్థించును. ఇట్లు పరిశుభ్రము చేయనిచో పేలుమున్నగు ప్రాణులు ప్రవేశించి శిరోజములను కొరికివేయును. కానవాటియభివృద్ధికి నూనె యత్యవసరము.

దుస్తులు-ఇవి మానసంరక్షణకేకాక శరీరమును మాయకుండచేసి నారోగ్యముగ నుండునట్లు చేయగలవు.

బంగారము, మంచిముత్యము, పగడము, మున్నగునవికూడ శరీరమునకు నారోగ్యమునిచ్చునవి యని

ప్రాచీనకాలమునుండియు వాటిని యలంకరించుకొనుట యలవాటైయున్నది. ఇవియన్నియు నూతనముగ వచ్చినవికావు. ప్రాచీనకాలమునుండియు నీయలంకారములను స్త్రీలు యలంకరించుకొనుచున్నారు.

ఒకప్పుడు సత్యభామ,

> "జలకంబాడి, మడుంగుగట్టి, మణిభూషాదీప్యమానాంగియై,
> కలపంబెంతయు వింతగానలది, చెంగల్వాల్నతిన్మించవే
> నలి గీల్కొల్పి, పసిండియందెరవళి వ్రాయంచ లంతంత రా
> జెలులుం దానును గూడివేగ జనుదెంచెన్నాధుడుప్పొంగగన్"

అని యెంతయో చక్కగ నలంకరించుకొని భర్తదగ్గరకు వచ్చినదట. మఱొక్కచో

> శాకపాకంబుల చవులవక్కాణించు గతికంకణంబులు ఘల్లుమనగ,
> నతివేగమిడుడు మీరనుమాడ్కి మేఖలాకీలితరత్నకింకిణులు మొఱయ,
> కలమాన్నరుచితోడ కలహించుజాడ, దువ్వలువపింజలు పెళపెళయనంగ
> నారగింపుడుమీరలని ప్రియంబాడెను, పొలుపునమెట్టియల్ గులుకరింప,

స్త్రీలు వడ్డనచేసిరట !—(పారిజాతాపహరణము) మఱియు

> అతివినోదముగాగ ... సీపచ్చల కడియాలపద్మగంధి
> చక్కెరమోవిచ్చి చవులదేలించు నాముత్యాలకమ్మల ముద్దులాడి
> తృణముగాజేయు నెంతటి ఘతినైన నీలాలముంగర నీలవేణి
> వెలలేనిపొందిక విడివడిమొఱయ నీకెంపుల బొగడలకీరవాణి

(అని విజయవిలాసము.) పూర్వమున స్త్రీలట్టివిధముగ నలంకరించుకొనెడివారట. ఆటి మేఖలములు, కంకణములు, మట్టియలు, కడియాలు మున్నగు యలంకారములు నేటికాలపుస్త్రీల చెంత నరుదుగ కాన్పించును. ఇవియేకాదు, పసుపుబొట్టు, పూవులు, మున్నగు నలంకారములుకూడ చాలమందికి మోటైనవి. అందుచేతనే పసుపు, బొట్టు, కాటుక, పూవులుధరించి, కలకలలాడే హిందూస్త్రీ యెవరైన కనబడినచో నామెనుచూచి చాలయానందపడెదము. కనుక నలంకారములు మోటన కూడదు. విదేశాంగనల నుదహరించుకొని, నేటి కాలపుస్త్రీలు సభ్యతకు సరిపడవని సౌందర్యము నాపాదించు, పసుపు, బొట్టు, మున్నగునవి వీడి దుస్తులకే ప్రాధాన్యమిచ్చుచున్నారు. అది యెన్నటికిని శ్రేయోదాయకముకాదు పాశ్చాత్యులుకూడ మన యాచారములు మంచివనికనిపెట్టి బొట్టుమున్నగునవి యలవరచుకొనుచున్నారు. వారు మన హిందువులవలె శీలమునకు నెక్కుడు ప్రాధాన్యమునీయరు. సరికదా భావిసంతతికి పాటుపడరు. వారిసొమ్ము తిండికి బట్టలకు ఖర్చుపెట్టెదరు. కాని మనహైందవస్త్రీలట్లుగాక, నిహము, పరముకూడచూచి భావిసంతతికొఱకు పాటుపడుదురు. అందుచే మనహిందూస్త్రీ లెంతటి విదుషీమణులయ్యును మనయలంకారముల నీడక శక్తి ననుసరించి ధరించుకొని తోడిస్త్రీలకెంతయో యాదర్శవనితలు కావచ్చును. కొందఱుస్త్రీలు తమ్మే నలంకరించుకొందురుకాని, యిల్లుమాడు, యింటియిల్లాలును చూడుదన్నట్లు. యింటివిషయము గమనించరు. వనలక్ష్మి వసంతుడువచ్చుసరికి, వనమున ప్రాతయాకులనురాల్చి, కొత్తచిగుళ్లతో పుష్పఫలభరితయై, కోకిలాగానములతో, పరుసగంభీరరవములతో, మరాళగమనములతో, మయూరనృత్యములతో, భ్రమరగీతములతో నలంకరించుకొని, భర్తకెదురేగినది. ఇయ్యది భర్తకేకాదు చూచినవారందఱికిని యానందమును జేకూర్చినదంటే ప్రతిస్త్రీయు తమ్మేకాక, తమగృహమునుగూడ శక్తికితగినట్లు, చక్కగ నలంకరించుకొని గృహమును భూలోకస్వర్గముగ జేసికొని శీలవతియగుటమంచిది.

వి. హేమలతాదేవి.

పీడితులైన పిల్లలకు అనేక పుష్కరాల నుంచి సేవ



పసితనమున బల్ల (లివర్) వ్యాధిచే పీడించబడుతూన్నవారికి, జమ్మివారి "లివర్ క్యూర్" అనేక పుష్కరాలనుండి సహాయకరమగుటచే వేలానవేల అమూల్య ప్రాణాలు రక్షింపబడినవి.

ఈ వ్యాధిని నిర్మూలించుటకు, డాక్టర్లు సామాన్యావస్థలో "సింపుల్" క్యూరును. క్లిష్టావస్థలో 'కాంప్లికేటెడ్' క్యూరునూ చికిత్సగా వాడుచున్నారు, 'సింపుల్' లివర్‌క్యూరును చిన్నమోతాదులవాడుక, ఆకలినీ జీర్ణశక్తినీ వృద్ధిపరచి మలబద్ధకమును పోద్రోలి లివరు, స్ప్లీనులు క్రమపద్ధతియందుండునట్లుచేసి, వ్యాధులురాకుండ ఉపయోగించును.

పిల్లలందు లివర్, స్ప్లీనులు తల్లినిబట్టి యేర్పడుతాయి. దీనిని అనుసరించుకొనియే 'జమ్మివారి టానిక్' ఆయుర్వేద సిద్ధాంతానుసారంగాతయారైనది గనుక, బల్లవ్యాధిచే పీడింపబడిన పిల్లలయొక్క తల్లులు గర్భిణులైనప్పుడు ఈ 'జమ్మివారిటానిక్'ను సేవించుట ఉత్తమం.



జమ్మివారి

## లివర్ క్యూర్

అన్నిచోట్లా దొరకును

జమ్మి వెంకటరమణయ్యా అండ్ సన్సు,
మైలాపూరు, మద్రాసు, ఫోన్ నం|| 8139
ఇతరచోట్లు: బెజవాడ, విజయనగరం, కలకత్తా, బొంబాయి, లక్నో, బెంగుళూరు, తిరుచునాపల్లి, etc.

స్వర్ణోత్సవ వికాసము

## నర్తనశోభ




పండిత డి. గోపాలాచార్యులవారి

## జీవామృతము

ఆ యిరువురూ ఆరోగ్యమూర్తులు. నిశ్చింతగా మధురమయిన నర్తనలో హాయిగా కాలము గడుపుతారు. అయితే నాట్యామాడుటేగాదు, పరిసరములలో నిత్య వసంతోత్సవ శోభ వెల్లి విరిసేలా చేస్తారు. అర్ధ శతాబ్దముగా ప్రసిద్ధ బలవర్ధక రసాయనముగా పేర్వడ్డ "జీవామృతము" మీలోనూ ఆ ఉల్లాసా బలానందములు ప్రజ్వలింపేలా ఆదర్శం చేయగలదు.



ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్
(స్థాపితము 1898)
మద్రాసు. 17

అలవరచుకోవడం కష్టసాధ్యమే. అయినా ఈరోజులలో, అత్తగారిచేత బాధలుపడే కోడళ్లు లేనేలేరు. బాధలుపెట్టే అత్తలు పూర్వముండకపోలేదు. నానాబాధలుపడ్డ కోడళ్లున్నారు. గాని, ఈరోజులలో, అటువంటి మూర్ఖురాలైన, అత్తలూలేరు. అటువంటి బాధలుపడే కోడళ్లూలేరు. ఇప్పటికి, అప్పటికి. మనుషులున్నా, కాలాన్నిబట్టి మారుతున్నారు. మారకతప్పదు కూడాను. ఈవిషయము అందరికి తెలిసిందే. ఇప్పుడు యువకులు, యువతులుకూడా, విజ్ఞానవికాసాలుగలిగి కొన్ని సాంఘికాచారములను, విసర్జించి, అభ్యుదయ మార్గాలను, అలవరచుకుని, వివాహము చేసుకుంటున్నారు. కాబట్టి, అత్తగారు, ఆడబిడ్డల, ప్రమేయమేమీ వుండదని చెప్పవచ్చును.

ఒకవేళ అలాబాధలుపెట్టే, అత్తలున్నా. విశేషముగా విద్యలుగడించుచున్న, కోడళ్లు, అత్తలను, మంచిమాటలచేత, సరిదిద్దుకోవచ్చును. ఇంటగెలిచి రచ్చగెలవమని సామెతవున్నది. అలాగే ఇల్లుదిద్దుకుని, తనింట్లోవుండే, వాళ్లని సరిచేసుకోలేనివాళ్లు ఇంక దేశానికేంపాటు పడగలరు అనేతోస్తుంది. అయినా, అత్తమామల నవమానపరచడం తనభర్త నవమానపరచడమే అవుతుందన్న వివేకము కోడలికి లేకపోవడం అజ్ఞానమనే అనిపిస్తుంది. లేనిపోని తగవులు పెంచుకుని అత్తలు ఆడబిడ్డలు-తోడికోడళ్లను, తనింటిచాయ రానీయకపోవడంవల్ల తనకేమంచిదికాదు సరిగదా. తనభర్తనుకూడా అల్లరిపాలు చేయడమవుతుంది. ఎంతచెడ్డా అత్తవంటి తోత్తు లేదన్నారు. రేపు తనకు ఓ కోడలు వస్తుందన్నసంగతి జ్ఞాపకముంచుకొని మన సోదరీమణులు అనాటి సీతా, సావిత్రులవంటి కీర్తిని పుట్టింటికి అత్తింటికి తేవాలన్న ఆసక్తితో, అత్తకోడండ్రకున్న ఈర్ష్యాభావమును రూపుమాపాలని ప్రయత్నముచేసి, మనమహిళలకున్న ఈ కళంకమును తుడిచివేయవచ్చును.

# గృహలక్ష్మి ఏజంట్లు:



గుంటూరు: వెల్‌కం & కో.
కర్నూలు: బాలసరస్వతి బుక్‌డిపో.
బెజవాడ: మాడరన్ న్యూసు ఏజన్సి.
కాకినాడ: పి. సాంబయ్య
అనంతపురము: వై. సాంబయ్య.
భద్రాచలం: టి. వి. జి. ఆర్. మూర్తి.
దొమ్మగూడెం: సి. హెచ్. బాపనయ్య.
నర్సాపూరు: వై. సుందర్రామయ్య.
కావలి: జి. రంగయ్య.
మారుటేరు: వి. వి. సుబ్బారావు.
గుడివాడ: యు. రామమూర్తి పంట్.
పిఠాపురము: యం. సూర్యరాజు.
కళ్యాణదుర్గం: కె. మల్లప్ప.
నిడదవోలు: కె. సి. సి. అయ్యర్.
మచిలీపట్నము: టి. బి. నారాయణశింగ్.
ఏలూరు: నేషనలు బుక్కుడిపో.
రాజమండ్రి: నేషనల్ ఏజన్సీస్.
తుని: కోడూరు సూర్యరాజు.
బరంపురం : కె. వి. రంగారావు.
విశాఖపట్నం: కె. సుందరేశ్వర్రావు.
కనిగిరి: కె. యస్. శాస్త్రి
పర్లాకిమిడి: బి. యన్. మూర్తి.
ఇచ్ఛాపురం: కె. గంగయ్య
బళ్ళారి: యస్. గురునాథ్
నెల్లూరు. ఎ. వి. నారాయణయ్య.
విజయనగరము : పి. నారాయణప్పడు.

భీమవరం: యన్. సూర్యనారాయణ.
పొన్నూరు: చౌదరి ఖాదీస్టోర్సు
మదనపల్లి: యన్. రాధాకృష్ణయ్య
అంబాజిపేట: పి. రామమూర్తి.
చికాకోలు: బి. యన్. మూర్తి.
వసంతవాడ: యస్. కె. శర్మ.
ఖర్గపూరు: యస్. వి. నాయుడు.
పార్వతీపురము: ఎ. వి. వి. యన్. మూర్తి.
తిమ్మనచర్ల: రాయలసీమ న్యూసుమార్టు.
వాత్తేరు: సిటి న్యూస్ ఏజన్సి.
జగత్యాల: కాసం, శివరాజగుప్త & సన్సు.
రంగూన్: నేషనలుస్టోర్సు.
ఎలమంచిలి: కె. దేముళ్ళు.
బాపట్ల: యల్. వి. మనోహరరావు.
నర్శిపట్నము: సి. రామం.
జంషెడ్‌పూర్: యం. శ్రీరాములు.
తాడేపల్లిగూడెం: జి. సూర్యరావు.
మహబూబ్ నగర్ : ముత్యాలు & సన్సు.
తేలూరు: ఎ. వెంకటశాస్త్రిగారు.
హైదరాబాద్ : నవ్యాంధ్రా ఏజన్సీస్.
కదిరి: జి. సి. కోదండరామయ్య.
గోకవరం: వి. వి గోపాల్‌రావు.
పామర్రు: జి. లక్ష్మయ్య.
ఛత్రపురం: వి. వి. రంగాచారి
డోర్నకల్లు : కె. జె. జి. సుందరం.
చోడవరం : పి. విశ్వేశ్వర్రావు.
తిరుపతి: ఆర్. చెంచల్‌రావు
చీరాల. పి. సూర్యనారాయణ

హిగిన్‌బాతమ్ స్టాలులవద్ద దొరకును.

 ఇతరచోట్లకు ఏజంట్లు కావలయును; డిపాజిటుతో దరఖాస్తుపంపుకొనుడు.




సూరిశెట్టి సాంబశివరావ్ బాబ్జీ

రావూ, దేవీ ఆరోక్లాసు మొదలుకుని యెంతో అన్యోన్యంగా చదువుకుంటూవొచ్చారు. వారిద్దరూ ఒకరొకరు హాస్యాలాడుకునేవారు. ఒకరికిలేని నోట్సు లింకొకరు సర్దియిచ్చేవారు. ఒకరికిరాని పాఠా లింకొకరు బోధపరిచేవారు. క్లాసులో ఒకరుయేడుస్తోంటే మరొకరికి అకస్మాత్తుగా కన్నీళ్లురాలిపోయేవి. ఇలా ప్రేమాతిశయాల్తో కాలచక్రాన్ని గిర్రునత్రిప్పుకుంటూ తయారయి కూచున్నారు స్కూలుఫైనలు పరీక్షలకి.

దేవి ఆవూళ్లో ఓడాక్టరుగారమ్మాయి. రావు తను ఆరోక్లాసు చదువుతూండేప్పుడు హిందీ నేర్చుకోటానికి వారింటికి వస్తూ పోతూ ఉండేవాడు. వాళ్ళయింట్లో అతను మూడేళ్ళపాటు యెంతో చనువుగా తిరుగుతూండేవాడు. దేవి, రావూ, యిద్దరూ ఆటల్లోనూ పాటల్లోనూ కలిసిమెలిసి వుంటూ పరీక్షల్లో యెవ్వరికీరాని ఎక్కువమార్కుల్ని సంపాయించుకునేవారు. దేవితల్లిదండ్రులుకూడా అతన్ని సొంతకొడుక్కి మల్లే పిలుస్తూ ప్రేమిస్తూండేవారు. కాని అదంతా పసితనం.

స్కూలుఫైనలు పరీక్షలోగూడా వీరిద్దరూ అన్నాచెల్లెలికి మల్లే తిరుగుతూ రాత్రీపగలూ కష్టపడి చదువుకున్నారు. పసితనంలో వారిమనసుల మధ్య నాటుకుపోయిన సోదర ప్రేమ మాత్రం అంతకంతకు పెరుగుతూవొచ్చింది. "అన్నయ్యా" అని తర్కించుకునేది దేవి. "చెల్లి" అని అంతరాత్మలోనే పిలుచుకునేవాడు రావు. కాని వారి మనోభావాలు మాత్రం లోకానికి తెలీవు. ఆఖరికెలాగో యిద్దరూ స్కూలుఫైనలుపరీక్షలో మంచి మంచిమార్కుల్తో పాసయ్యారు.

వారిద్దరిలోనూ యవ్వనాంకురాలిప్పుడిప్పుడే చిగురిస్తూన్నై. అయితేమాత్రం? వారు పెరుగుతూన్న కొద్దీ ఆసోదరప్రేమకి వారిహృదయాలు అడ్డుచెప్పలేకపోయినై.

ఇహకళాశాల-కొన్ని కొన్ని ఆర్థికవిషయాలకి గురయి రావు అంతటితో తనచదువుకి స్వస్తిపలికాడు. కానిదేవిమాత్రం కాకినాడకాలేజిలో ప్రవేసించింది. తనచెల్లెలితో పూర్వంలాగా చదువుకునే మహాభాగ్యం లేకపోయిందిగదా అని రావు యెన్నోమార్లు తనంతటతానే యేడ్చుకునేవాడు. అయినా విధిలిఖితాన్ని యేం చెయ్యగలడు? — కావలసిందేదో కానే అయింది. రావు ఓ ఆఫీసులో గుమస్తాగిరీకి ప్రవేశించాడు.

దినాలు త్వరత్వరగా జారిపోతున్నై. మరో మూడునెల్లయ్యేక రావుకి కాకినాడదాటి యేదో వూరికెళ్లాల్సిన అగత్యం పడింది. తనచెల్లెలి చదువేనా చూసి దుఃఖస్రవంతుల్ని దిగమ్రింగుకుని ఆనందించే మహాభాగ్యం ఆనాడుకలిగిందిగదా అని తన్మయుడై పోయాడతను. చెల్లెల్ని పరామర్శించుదామని మహా ఉబలాట పడ్డాడు.-చెల్లెలికెన్నో బహుమానాలు తీసుకెళ్దామని యెంతో సరదా పడ్డాడు-అందుకు దేవికూడా ఆనందలహరినిపొంగజేస్తూ అన్నయ్యని ప్రేమార ఆహ్వానించింది. కాని దేవుడు ఆఅన్నాచెల్లెళ్ల ఆశయాలను

తీర్చలేకపోయే దుర్మార్గుడయ్యాడు. బహుశా వారి సోదర ప్రేమను చూచి తక్కిన క్రూరమానవులకు మల్లే తనూ చూడలేక అనుమానించాడేమో! అక్కడ అన్నయ్య వస్తాడుగదా అని యెదురు తెన్నులు చూస్తూవుంది దేవి. ఇక్కడ కొన్ని కారణాంతరాలవల్ల రావు కాకినాడలో దిగలేక పోవటం తటస్థించింది. అందుకు తన విచారం తెలియపరుస్తూ అతను క్షమాపత్రాన్ని రాసివేడుకున్నాడు. దేవి కన్నీటి కాలువలు పారిస్తూ సెలవులకు వొచ్చినప్పుడు ఇంటిదగ్గర కలుసుకోమని జవాబు వ్రాసింది.

ఇంతలో దసరా వొచ్చేసింది. సెలవులకు దేవివాళ్లయింటి కొచ్చింది. రావు యెంతో ఆత్రంతో గబగబా వారింటికెళ్లాడు కాని అతనికి అక్కడ పూర్వముండే శోభకనిపించలా. అతన్నిచూసి దేవి ఎక్కడో దాక్కునేది. అతనికిదేమీ అర్థమయిందికాదు. తనమనసు ఆమెనుచూసి పరామర్శించాలని ఆత్రంతో తహతహలాడ్తోంది. 'ఏమోయ్! బాగున్నావా?' అనిపలుకరిస్తుందిగదా అని పుట్టెడాశపడ్డాడతను. పలుకరించటం మాటపోనియ్యండి గాని దేవి అతనికంటికేనా కనిపించలేదు. ఏం?— అంతప్రేమగా చూస్తూండే దేవికి తన పూర్వపు అన్నయ్యమీదనా అసిగు? కాదు, కాదు. మానవపిశాచాలకు జడిసి ఆమె అట్లా జంకిపోయింది. స్త్రీల హృదయం దూదికన్న మెత్తన! కాస్తగట్టిగా కసిర్తేచాలు; గుండెలేమూలకో పారిపోతాయ్. రావుకీ దేవికీమధ్య ఉత్తరాలు నడిచాయని ఆమెతలిదండ్రులకు తెలిసింది. ఆమెనాన్నగారి హృదయంలో రేగిందాక భయంకరమైన తుపాను! పూర్వం తనసొంత కుమారుడికిమల్లే ఆప్యాయంగా చూసుకున్న రావుని లవలేశమూ విశ్వసించలేక పోయాడు. ఆయన వీరిద్దరిలో యేదోరహస్యం వుండి తీర్తుందని అనుమాన పడ్డాడు. అది ఈనాటి ప్రతిమానవుడికీ మనదేశంలో పరిపాటేగా! వెంటనే అయన కుమార్తెని మందలించాడు. తనకిక ముందెప్పుడైనా అలాంటిది తెలిసిందంటే చదువుమానిపించేస్తానని బెదరించాడు. పాపందేవి వొణికిపోయింది. ఆమెకు చదువుకుందామని అభిలాషయెక్కువ. ఈమధ్యని తనచదువుకెక్కడ అంతరాయం కలిగిస్తాడో అని భయపడింది. సామాన్యస్త్రీయైపుట్టి ఒకసోదరుడికి తనయోగక్షేమాలు రాసుకుందుకేనా స్వాతంత్ర్యంలేనిజీవితమాయని కుమిలి పోయిందిదేవి. రావుకూడ ఆమెనాన్నగారు యిటుపైని ఉత్తరాలేవీ రాయొద్దని శాసించాడు. మునుపటి ఉత్తరాలన్నీ తనిఖీచేశాడు. అంతకీ మనసుమారిందికాదు. ఏంచేస్తారు పాపం ఆనిర్భాగ్యజీవులు— లోకానికి కళ్లులేవు. వారిద్దరిమధ్యనూ ఊగులాడ్తూండే భావపరంపర ఆనాటినుంచి తెగిపోయినై. వారిప్రేమాభిమానాలకి అవరోధం యేర్పడింది. వారి సోదరప్రేమవాహినికి అడ్డంగా ఓ ఆనకట్టు కట్టేసిన ఆమానవరాక్షసుల నేమనిపిలవాలో తెలీటంలేదు. పాపం— ఆ అన్నాచెల్లెల్లిద్దరూ మనసులలోనే వారిప్రతిమల్నినిలుపుకొని తలంపుకొచ్చినప్పుడల్లా కుమిలి కుమిలి యేడుస్తుంటారు. ఓ స్త్రీకి తను ఉత్తరం రాసుకునే పాటి స్వాతంత్ర్యమేనా యివ్వనినాడు వారంతా పైకి వృద్ధిలోకిరావాలంటే యేలావస్తారు? వంటయిల్లే ప్రపంచంగా ఆడవాళ్లు గుర్తించుకునే కాలంపోవాలంటే లోకంచెయ్యాల్సిన కర్తవ్యం, యిదేనా?— ఎందరు సోదరీ సోదరు లిలాంటి మానవసంఘ క్రూర నిబంధనలకి దాసులై పోతున్నారోగదా! ఈమానవరూప రాక్షసుల దృష్టి పడ్తూండగా యిద్దరు స్త్రీపురుషులు అన్నాచెల్లెళ్లయినా సరే, కాస్సేపు మాటాడుకోరాదు— నవ్వుకోరాదు— యోగక్షేమాలురాసుకోగూడదు. యీనాడు వ్యభిచారుల్నిపూజిస్తోంది, గౌరవిస్తోంది. అన్నాచెల్లెళ్ల సోదర ప్రేమననుమానించి అపవాదు వేస్తోంది. ఇదేనాలోకం!— ఇదేనా లోకకళ్యాణానికి మార్గం?— ఇదేనా సోదరమానవులు చెయ్యాల్సిన కర్తవ్యం?— ఇంతకూ యెన్నాళ్లీ దాస్యశృంఖలాలు?—

---

# కీ. శే. వంగోలు వెంకటరంగయ్య పంతులుగారు

మా "గృహలక్ష్మి" కి ప్రప్రథమమునుండిన్నీ పితామహతుల్యులైన శ్రీ వంగోలు వెంకటరంగయ్య పంతులుగారు ఈ 9-6-49 దిన దివంగతులైనారని వ్రాయడానికెంతైనా చింతిస్తున్నాము.

శ్రీ పంతులుగారి జననం 1867సం||ము. 82 సం||ల వృద్ధు. ముగ్గపండిన పండువలె రాలిపోయినారు. ఈమధ్య హర్ బిలాస్ శర్దాగారిని గూర్చి వ్రాస్తూ సహస్రమాసములు నిండడాన్నిగూర్చి ఇంచుక చర్చించి అధికమాసాలతో చేర్చి సరిపెట్టారు. బహుశా వారంతరాత్మలో తామును తద్విధిగా సహస్రచంద్ర దర్శన పుణ్యఫలావాప్తిచెందితిమని తృప్తిచెందారు కాబోలు. అందుకు సందేహములేదు, గతకల్మషుడై సంచిత పుణ్యుడై స్వర్గ మలంకరించాడు.

ఆంధ్ర, ఆంగ్ల, సంస్కృత పారసీక తమిళాదిభాషల పెక్కింటిని నేర్చారు. నేర్వడమేకాదు. వాటన్నిటిని తరిచిచూచారు. పండితుడు; విమర్శకుడు; రచయిత. ప్రాచీన విజ్ఞానవేత్త; ఆధునిక సంస్కారణాభిలాషి. అసలు 'వంగోలు'వారు—శాఖకు లౌకికులైనా యజ్ఞయాగాది క్రతువులొనర్చిన కర్మిష్ఠులు. ఆ వంశంలోజన్మించి ఆ సంప్రదాయాన్నింకా బాగా హృద్గతంచేసుకొనిఉన్న ఇద్దరిలో ఈయన జ్యేష్ఠులు. రెండవవారైన ముని సుబ్రహ్మణ్యంగారు వంగోలులో సుఖజీవన మొనర్చుచున్నారు.

వృత్తికి వకీలైనా — నిరంతర విద్యావ్యాసంగమే ప్రధానంగా చూచుకున్నవారు. ఎంతటి గహనమైన విషయాన్నైనా అరటిపండువలిచి చేతిలోబెట్టినట్లు చెప్పగల నేర్పరులు-అందుకాయన కాయనేసాటి. విషయ సంగ్రహణములో - చీమకు తేనెటీగకు ఆయనకున్న శక్తిలో ఓర్పులో శతాంశము లేదనవచ్చు.

ఆయన నెల్లూరిలో వకీలువృత్తిలో చేరినదాది (1899) ఈ 50||లుగా సకల ప్రజాహిత కార్యోద్యమములలోను పాల్గొన్నారు. సహాయనిరాకరణోద్యమంలోనూ ఖైదుకుపోలేదు; వృత్తిని విసర్జించలేదనేగాని ఖద్దరుధారణాది కార్యక్రమమును అవలంబించి ప్రోత్సహించారు. ఆంధ్రోద్యమానికి ఆయన పట్టుకొమ్మ. చెన్నపురి ఆంధ్రరాష్ట్రానికి రాజధానిగా ఉండదగునని 5వ ఆంధ్రమహాసభ ఆహ్వానసంఘాధ్యక్షులుగా 1917లో ప్రప్రథమంగా సూచించిన వారాయనయే. ఆనాడు తరసర్కారులవారు ఆసూచన తోసివేయనిచో- ఈ నాడందులకై ఆంధ్రనాయకులు కాళ్లుగాలిన పిల్లులవలె గంతులువేయవలసియుండేదిగాదు.

ఆయన ప్రప్రథమం నుండిన్నీ మా "గృహలక్ష్మి"ని వాత్సల్యమున ఆదరించారు. ప్రథమ సంపుటి 6 వ సంచికలోనే వారి ప్రథమవ్యాసం "వివాహవయోనిర్ణయం" అనేది ప్రచురింపబడినది. తదాది అనేక అపూర్వవిషయాలను సేకరించియు, రచించియు పంపుతూవచ్చారు. ఇంకా వారు సేకరించిపంపిన శ్రీ తులస్యష్టోత్తర స్తోత్రమున్నూ, పిళ్లారిసెట్టి కోదండరామదాసు అనే భక్తుడు రచించిన "రామకృష్ణ భక్త సంవాదము" అనే ద్విపదయున్నూ ప్రచురింపవలసియున్నది. వారు కొన్నాళ్లు "గృహలక్ష్మి" సంపాదకీయ సలహాసంఘసభ్యులుగా కూడా ఉండిరి.

ఇట్టి వీరి మరణమునకు మేమెంతయు చింతిల్లుచు అర్ధశతాబ్దమునకుపైగా వారి సహధర్మచారిణియై యుండి, దుర్భరవైధవ్యావస్థ నేడుతప్పించుకోజాలక అలమటించుచున్న వారి ధర్మపత్నికిన్నీ వారి కుమారులు పద్మరాజుగారికిన్ని మా సానుతాపమును వెల్లడించుచున్నాము.

# నవజీవనం

శ్రీ రాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీవారు జెమినీ స్టూడియోస్‌లో నుత్పత్తిగావించిన "నవజీవనం" అను తమిళ చిత్రమును 3-6-49 న "కేసినో" థియేటరునందు పత్రికా ప్రతినిధులకు విజ్ఞులగు ఇతర మిత్రులకు ప్రత్యేకముగ ప్రదర్శించిరి. గాంధీ భక్తుడు; కార్మిక సేవకుడు మహదేవన్ మొదలి; అతనిభార్య అనుకూలవతి అన్నపూర్ణ; అతని తమ్ముడు ప్రభాకరం బి. ఏ. విద్యార్థి. ఆ దంపతులది క్లుప్త జీవనం. వారు ప్రభాకరాన్ని అనురాగంతో చూచేవారు. అన్నకన్నా హెచ్చుగా వదినే మరది విద్యాభివృద్ధి కోరుతుంది. బి. ఎల్. పరీక్ష పోతే మళ్లీ కట్టడానికి డబ్బులేకపోతే, ఆమె మెళ్లోనగ నటరాజ మొదలియారువద్ద తాకట్టుపెట్టి డబ్బు తెచ్చి ఇస్తుంది. అతని సహపాఠు లిద్దరు బాలికలు— కమల, దొరస్వామి మొదలియారు అనే బట్టల మిల్లు యజమానికూతురు; వనజ, నటరాజ మొదలియారు కూతురు. ప్రభాకర్‌ను కమల ఆకర్షిస్తుంది; వనజకు ఈర్ష్య పట్టుకుంటుంది. నటరాజ మొదలియారు ప్రోద్బలంచేత కమలా ప్రభాకరులకు వివాహమవుతుంది. కార్మిక నాయకుని తమ్మునికి, మిల్లు యజమాని కూతురికి వివాహమేమిటి "నాన్ సెన్సు" అని అన్నాసామి, కమల అన్న, ఇల్లు విడిచి పోతాడు. అతడు తిరిగీ వచ్చేసరికి దొరసామి మొదలియారు కూతురిని అల్లుడిని సర్వాధికారుల నొనర్చి, - చనిపోతాడు; అన్నదమ్ములిద్దరు, తోడి కోడండ్రిద్దరు ఇంట్లో చేరుతారు. అన్నపూర్ణదే సర్వాధికారం. అన్నాసామికి తలకంటగిస్తుంది. నటరాజమొదలియారు తన కూతునిచ్చి వివాహం చేసి - ఒక ఇంటివాణ్ణి, ధనవంతుణ్ణి చేస్తానని ఓదారుస్తాడు. ఇట్లా సర్వం సుఖంగా జరుగుచుండగా- వనజ ఈర్ష్యచేత వారి సుఖజీవనం ధ్వంసంచేయను ఉపాయం పన్నుతుంది. కమలతో స్నేహంగా- "నీయింట పెత్తనం - అక్క - అంటూ తోడికోడలి కప్పజెప్పావేమి?" అని దెప్పిపొడుస్తుంది. అది తేలుకొండి విషమువలె కమల మెదడు కెక్కుతుంది. ఆమె ఆ విషం భర్తకున్నూ ఎక్కించును. ఉభయులు, మహదేవన్, అన్నపూర్ణలను అవమానిస్తారు. వారు తమ యింటికి తిరిగిపోతారు.



(జయలక్ష్మి)

చదువుకొన్న కమలకు ఇల్లుచాలదు; బాహ్యకార్యక్రమము ఎక్కువవుతుంది. ప్రభాకరానికి వంటరిపాటు కలుగుతుంది. ఈ అవకాశం చూచుకొని వనజ అతనిదరి చేరుతుంది.

ఈ సందుకట్లలోనే, కార్మికులకు కష్టాలు కలుగుతాయి. మహదేవన్ ఎంత చెప్పినా ప్రభాకరం వినడు. ఆయనకు నటరాజ మొదలి తోడు. మహదేవన్ రోగగ్రస్తుడై యుండగా నటరాజ మొదలి పాత బాకీకి వారిల్లు జప్తు చేయించును. రోగం ప్రమాదావస్థలోనుండగా అన్నపూర్ణ మిగిలియున్న తన తాళిబొట్టుఅమ్మి మందిప్పిస్తుంది.

మహదేవన్ పునరారోగ్యవంతుడై ప్రభాకర్ కార్మికుల కడగండ్ల తీర్చను నిరాకరించినందున కార్మికులచే సమ్మె కట్టిస్తాడు.

అట కమల నాటకం చూచివచ్చి ఇంటివద్ద వనజా ప్రభాకరలు స్నేహంగా ఉండడం చూస్తుంది. గొడవచేస్తుంది. ప్రభాకర్ తగవులాడి పోతుంటాడు. అన్నాసామి ఇదే అదును అని ప్రభాకర్ మీద పిస్తోలు పేలుస్తాడు - అడ్డము వచ్చిన వనజకు తగిలి చచ్చిపోతుంది. అంతట విడువక - ప్రభాకర్ వెంటపడతాడు. ప్రభాకర్ వెళ్లి అన్న వదినెలను క్షమార్పణకోరుతాడు. వారా



అన్నాసామి — నటరాజమొదలి

దరిస్తూండగా అన్నాసామివచ్చి పిస్తోలు పేల్చును. ఆ దెబ్బను అన్నపూర్ణ అడ్డమువచ్చి స్వీకరించును. ఆమె కెట్టకు గాయమవుతుంది. కమల కూడా పశ్చాత్తప్తురాలై వస్తుంది. కార్మికుల కడగండ్లు తీరుతాయి. అన్నాసామి జైలులో పడతాడు. ఇది తమిళ చిత్రమైనా - చాలామంది ముఖ్యతారలు అరవలు కారు. నాగయ్య (మహాదేవన్) కన్నాంబ (అన్నపూర్ణ) నారాయణరావు (నటరాజమొదలి) పంతులు (దొరసామిమొదలి). అయినా వీరంతా తమిళం చక్కగానే ఉచ్చరించారు. కన్నాంబ సంస్కృత పదాలనుగూడా అరవవారి మాదిరి వత్తులు విడచి ఉచ్చరించడం నేర్చుకున్నది. నాగయ్య కన్నాంబలు వెండితెరమీద ధృవతారలు. మరిది విద్యాభివృద్ధియందు ఆసక్తి చూపేపట్ల, అతడు పొరబడ్డప్పుడు అధిక్షేపించేపట్ల, భర్తకు మందిప్పించను తాళిబొట్టు విక్రయించుపట్ల - ఆమె నటన ఎంతైనా ఒప్పియున్నది. పంతులు, రావు శ్రీరామన్ (ప్రభాకర్) తమ తమ పాత్రలను చక్కగా నిర్వహించారు. అన్నాసామి కొంచము అతిచేస్తున్నాడా అనిపించినది; కాని అంతగా అతిగాదు. వనజ కమలతో 'తోడి కోడలు, అక్క కాదు' అని సూక్ష్మంగా విషపుసూది గుచ్చడం రసవంతమే. కాని కమలలో మార్పు క్రమంగా గాక హఠాత్తుగా జరగడం - అసహజం. మొత్తానికి పిక్చర్ అంతా సరళంగా సాఫ్‌గా నడిచినది. ప్రేక్షకులకు విసుగు కల్గించలేదు. తమిళ చిత్రాలలో మోటహాస్యం హెచ్చని వాదు. అదియు కన్పించదు. కాని నాట్యకర్తలు గోపాలయ్య సంచాలనముకన్నా శాస్త్రకళా విశేషములు చూపితే మంచి దనిపించినది. అనవసరంగా కథ పెంచలేదు; అవసరవసరంగా కథను కుంచించలేదు. ఇంత చక్కని చిత్రం తీసిన రాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీవారు వెండితెర కమ్మ్వ సేవచేసినారు. ఇట్టి తారలుండినన్నీ - ఇటీవల పేరు పొందిన తెలుగు పిక్చర్ రాకపోవడం విచారణీయాంశము.

(మాంసినీఫార్క్)

# సినీమా లేఖ

రచన: "అయ్యన్న"

ప్రియమైన "కాంచనమాలా",

మీఅన్నయ్యకు "మళ్ళీపెళ్ళి" అయిందని మన "శ్రీయాళ" చెప్పేడు. ఇక్కడమన "భోంఢారం పెళ్ళి" అవుటచేత రాలేకపోయేను. మీఅన్నయ్య పెళ్ళి "తారుమారు" కాకుండా అయిందా? ఈ ఏడాది "మనదేశం"లో పాడి పంటలు బాగానేవున్నాయి. మన "పోతన" "రైతుబిడ్డ" కాబట్టి వానికికళ్ళు నెత్తికొచ్చాయా? "పోతన" మొన్న "లాహోర్" వెళ్ళి ఎవరో "మాలపిల్ల"ని తీసుకొచ్చేడు. అందుచేత వానిని "ద్రోహి" అని అంటున్నారు.

నాకీ "సంసారం"లోంచి తప్పించుకొని యెక్కడికేనా పోవాలనివుంది. ఈ "కలికాలం"లో ఎంత డబ్బు తెచ్చినా చాలా ఇబ్బందిగావున్నది.!

మొన్ననే మా "గుణసుందరి"కి "సువర్ణమాల" కొని పుట్టింటికి పంపించేను. "సువర్ణమాలే" కాకుండా "రత్నమాల" కూడా కొనమంటోంది. డబ్బుఎక్కడిదీ? నిన్ననే మా "లక్ష్మమ్మ"ని అత్తారింటినుంచి తీసుకొచ్చేను. అంతకు మునుపునుంచే మా "చింతామణి" ఇక్కడేవుంది. మాయింటి పక్కనున్నతనికి దయ్యంపడితే ఎవరోసాధువొచ్చి ఒక "రక్షరేక" కట్టాడు; అది కట్టినవెంటనే దయ్యం పోయింది!

మీవదినగారు "మోహిని" లాగా అందంగా వుంటుందా? మీఅన్నయ్య "ధర్మపత్ని"ని చూడాలనివుంది. ఈవూరు "గృహప్రవేశం"కు వచ్చినప్పుడు చూస్తానులే. వచ్చేనెలలో మా "బారిష్టర్ పార్వతీశము"కు వివాహము అవుతుంది. అన్నట్టు చెప్పడం మరచిపోయాను!

మొన్నమన "పోతన" తల్లితోదెబ్బలాడి, కొట్టేసి రాత్రి "పదిగంటల"కు "గాంధీనగర్" పారిపోయాడు. వానికి "తల్లిప్రేమ" ఎలాంటిదో తెలేదుకాబోలు! నువ్వుమాత్రం ఈ "మాయాలోకం"లో ఎవరినీనమ్మకు.! జాగ్రత్త!! వెంటనే "జవాబు" వ్రాయవలెను.

---

# పదిమంది అందగత్తెలు.

అంటోనీ బ్యూచాంప్ అనేఅతడు లండనువాసి; అంద చందాలుగల వారి ఫోటోలు తీసేవాడు. ఇతడుప్రపంచములో కెల్లా మించిన అందగత్తెలని తోచిన పదిమంది- ఫొటోలుతీశాడు. వారిలో నలుగురు భారతీయయువతులు: హైదరాబాదు రాకుమారి నిలోఫర్, బీరారురాకుమారి దుర్రాషీవర్, అన్షారాకుమారి, జయపూరు మహారాణీగార్లు. వీరంతా ఆదిగర్భేశ్వరులని చెప్పనక్కరలేదు. మిగతావారు ప్రపంచంలో నలుముఖాలా ఉన్నవారు. వీరిలోముగ్గురు ఆంగ్లయువతులు; ఒక్కర్తె పరాసు యువతి; మరొక్కతె స్వీడన్ దేశపుయువతి; వేరొక్కతె–స్విడ్జర్లండు యువతి; అయితే ఈ 6గురు భారతీయ నారీమణులవలె అంతఃపుర స్త్రీలుకారు. నటీమణులు; సినిమాతారలు.

# బోనస్ ప్రాణం తీసింది!

బొంబాయిలో గోవింద్ అనే కార్మికునికి 80రూ॥లు బోనస్ వచ్చింది. అది జేబులో వేసుకొని వెంటనే అతడు జూదమాడాడు; సారాతాగాడు; కులాసాగా గడిపాడు. వట్టి జేబులతో, చిరాకు పరాకులతో తూలుతూ తూలుతూ—ఇంటికి పోయినాడు.

ఇంటివద్ద అతనిభార్య ద్రౌపతీభాయి—ప్రియుడు జేబులనిండా రూపాయలతో వస్తాడు.

కొత్త కోకా తెస్తాడు;
అత్తరు సీసా కొంటాడు;
చెట్టా పట్టాల్ పట్టుక
సినిమా కెళ్లి చూస్తాము;
సన్న సన్న సామాను -
కొల్ల కొల్లలు కొనుక్కొని
అమ్మగారి ఇంటికి
అతడూ తాను పయనమై
రేపో మాపో పోతాము!

అని కలలు గంటున్నది. రాగానే రూపాయ లేవన్నది. కాస్సేపు కీచులాడుకున్నారు. దాన్ని వాడు నాలుగుతన్నాడు. అది అలసి నిద్రపోయింది. వానికి నిద్రపట్ట లేదు. తనుచేసింది తప్పనితోచింది. బుడ్డినిండా ఉన్న కిర్సనాయిల్ వంటినిండా పోసుకొని అంటించుకున్నాడు. పెళ్లాము, ఇరుగు పొరుగు లేచివచ్చి ఆర్పారు; ఆసుపత్రికి చేర్చారు. మర్నాడు పరమపదించాడు. బోనస్ ప్రాణందీసింది!

# సామెతలు

544. అత్తను అల్లుడంటేఆశ బ్రాహ్మణికి పప్పు అంటే ఆశ.

545. అవకతవకరాజు, అవివేకపుమంత్రి, బుర్రలేని పరివారము.

546. అబద్ధాల అంకయ్యకు అరవైనాలుగు అసత్య ప్రమాణకాలు.

547. అక్కరకురానిచుట్టాలు ఎంతమంది ఉన్నా ఏమిలాభము ?

548. అంధునికి అద్దముచూపిన ఏమిలాభము ?

549. అదృష్టము చెప్పిరాదు, దురదృష్టము చెప్పిపోదు,

550. అలికిముగ్గుపెట్టగానే అమ్మవారి పండుగ యగునా ?

551. అలకపాన్పుమీద యల్లుడుఅలిగితే అత్త గాభరాపడ్డది.

552. అత్తగారిసొమ్మువచ్చిన ఆలోచనలేకుండా, ఖర్చుచేయాలి.

553. అమ్మబోతే అడవి, కొనబోతే కొరవి.

554. అగ్గిఅయినా కడగనిది ముట్టుకోకూడదు.

555. అడగనిదే అమ్మఅయినా బువ్వపెట్టదు.

556. ఆశకు అంతములేదు, దురాశకు విచారములేదు.

557. ఆవూరికి ఈవూరుఎంతో, ఈవూరికి ఆవూరు అంతే.

558. ఆరోగ్యమే మహాభాగ్యము.

559. ఇంటికిజేష్టాదేవి, పొరుగునకు లక్ష్మీదేవి.

560. ఇంటిదేవర ఈదిచస్తే పొలందేవర గంపజాతర అడిగిందట.

561 ఇంటివాణ్ని లేపి దొంగచేతికి కట్టెఇచ్చినట్లు.

562. ఇంట్లో పాయసమున్నా, మందలో పాలు కూడానా ?

563. ఇంట్లో పెండ్లిఅయితే ఊళ్లోకుక్కలకు హడావుడి.

564. ఇంట్లో ఈగ పులి, బైట పెద్దపులి.

565. ఇచ్చినవాడే నొచ్చినవాడు, చచ్చినవాడే అచ్చినవాడు.

566. ఇచ్చేటప్పుడు కాముని పండుగ, పుచ్చుకొనేటప్పుడు దీపావళిపండుగ.

567. ఇచ్చేవాణ్ణిచూస్తే చచ్చేవాడైనా లేచును.

568. ఇనుముకరిగేచోట ఈగలకేమిపని ?

569. ఇప్పపూలకు వాసన వెతకవలెనా ?

570. ఇల్లుకాలుచుండగా వాసాలు దూసుకొన్నట్లు.

571. ఇల్లుగెలవనివాడు రచ్చగెలుచునా ?

572. ఈకంటికి ఈరెప్పలు దూరమా ?

573. ఈచేతచేసి ఆచేత అనుభవించినట్లు.

574. ఈతగింజఇచ్చి తాటిగింజ లాగేవాడు.

575. ఈదబోతే త్రాగనీళ్లులేవు.

576. ఈనెలలో వడ్డీలేదు, ఆనెలలో అసలూలేదు.

577. ఈ అంబటికేనా ఇరువైనామములు ?

578. ఉడుమును చంకలోపెట్టుకొని ఊళ్లోప్రవేశించినట్లు.

579. ఉతికేవానికిగాని చాకలి ఉతుకడు.

580. ఉత్తర ఉరిమికురిసినా పాము తరిమికఱచినా తిరుగదు.

581. ఉన్నమాటచెప్పితే ఊరుఅచ్చిరాదు.

582. ఉన్నవాడు ఊరికిపెద్ద, చచ్చినవాడు కాటికిపెద్ద,

583. ఉప్పుతో ముప్పైఆరూ వుంటే వట్టిముండైనా వండుతుంది.

584. ఉభయభ్రష్టత్వం వుపరి సన్యాసం.

585. ఊరంతాచుట్టాలు వుట్టికట్టనుతావులేదు.

586. ఊరు వుస్తెకాయంత సిద్ధాంతము తాటికాయంత.

587. ఋషిమూలమూ, నదిమూలమూ, స్త్రీమూలమూ విచారించరాదు.

588. ఎంతమంచి గొల్లకైనా వేపకాయంత వెఱ్ఱి లేకపోదు.

589. ఎంతమంచి పందిఅయినా అశుద్ధము తినక మానదు.

590. ఎక్కడనయిన బావా అనవచ్చుగాని వంగతోటవద్ద బావా అనగూడదు.

591. ఎక్కడికి పోతావు విధవమ్మా అంటే, వెంటనే వస్తాను పదమ్మా అన్నదట.

592. ఎక్కిపోయి పట్టిచూచి దిగివచ్చి రాళ్లు రువ్వినట్టు.

# లోకవార్తలు

కొచ్చి తిరువాన్కూరు రాజ్యములు కలిసిపోవుటకు సమ్మతింప బడినది. శ్రీ తిరువాన్కూరు మహారాజావారు రాజప్రముఖ్ గా ఉంటారు.

♦ ♦ ♦

సినిమాలపై రాష్ట్రప్రభుత్వాలు విస్తారంగాపన్ను వేస్తున్నారని భారతదేశంలోగల 2200 సినిమాధియేటర్లు జూన్ 30 వ తేదీన మూతవేసి సమ్మెకట్టుటకు తీర్మానించారు.

♦ ♦ ♦

భారతీయ నాగరికతా పరిణామ దశతెల్పు బొమ్మలతో క్రొత్తతపాలా బిళ్లలు ప్రచారమునకు దెచ్చుటకు భారత ప్రభుత్వము వారిదివరలో నిర్ణయించియుండిరి. ఆబిళ్లలు 15-8-49 (రెండవ స్వాతంత్ర్యదిన వార్షికోత్సవము) న ప్రకటితమై ప్రస్తుతమున్నవానితో పాటు విక్రయింప బడునట.

♦ ♦ ♦

యూనియన్ ప్రభుత్వము వారు హిందీభాషలో టెలిగ్రాములు స్వీకరించి ప్రచారము చేయుటకు ప్రారంభించినారు. ముందుగా ప్రయాగ, కాశీ, ప్రయాగ ఆగ్రా, లక్నో, కాన్పురము, పాట్నా, గయా ఆనేపట్నాలమధ్య ఈమాసారంభమునుండి ఈక్రొత్త పద్ధతి అమలులోనికి వచ్చినది.

♦ ♦ ♦

వార్ధాజిల్లాలో ఒక 109 సం॥ వృద్ధుడు బట్టల మిల్లులో పనిచేస్తున్నాడు. అతనిపేరు గణపతిసాహు. ఆయాసంలేకుండా నడుస్తాడతను. కళ్లెలు కోడు తాడు; సుఖంగా ఉన్నాడు.

♦ ♦ ♦

మొరార్జీదేశాయి బొంబాయి ప్రభుత్వంలో పోలీసు మంత్రి. ఇటీవల ఈయనతనవద్ద ఉన్నజవాను ఆతిథ్యం స్వీకరించను కుమార్తెతో కలిసి వానలో తడుస్తూ 12 మైళ్లు నడిచివెళ్ళాడట. లోగడ రాజాజీ మద్రాసు ప్రధానిగా ఉన్నప్పుడు తన జవాను కూతురపెళ్ళి,కివెళ్లివచ్చేటప్పుడు మామూలుగా ఇచ్చే కొబ్బరికాయ 'ఏది'అని అడిగి మరితెచ్చుకున్నాడు !

♦ ♦ ♦

డాక్టరు హెచ్ సయ్యద్ కన్య యం. డి. మద్రాసువాసి. ఇంగ్లాండు వెళ్లి 18 మాసములు ఉన్నత వైద్యవిద్య చదివి తిరిగీ యింటికి వచ్చినది. అక్కడ-ఆమె యమ్. ఆర్. సి. ఓ. జి. (లండన్) యఫ్. ఆర్. సి యస్ (యడింబరో) డిగ్రీలు పొంది వచ్చియున్నది. ఇట్టివిద్య నభ్యసించిన ముస్లిం యువతులలో నీమెయే ప్రథమురాలు.

♦ ♦ ♦

అపహరింపబడిన యువతిని సంరక్షించడానికి యు. పి. లో నొకగ్రామమునకు పోలీసు ఇన్స్పెక్టరు సిబ్బందిని వెంటబెట్టుకొని వెళ్లినాడు. ఆ అభాగ్యవతిని ఒకగదిలో పెట్టితాళం వేశారు. పోలీసు ఇన్స్పెక్టరు తాళం తీయమన్నాడు. 12 మంది స్త్రీలు సాయుధలై ఆతని నడ్డగించారు. వారిలో నొకతాటకి అతనిని నెత్తిపై దుడ్డుకర్రతో కొట్టినది. ఇంతలో 70 మంది దాకా స్త్రీ పురుషులు సాయుధులై పోలీసుల నెదుర్కొన్నారు. ఇన్స్పెక్టరు ఆత్మ సంరక్షణకై రివాల్వర్ పేల్చాడు. దానిని పడకొడదామని దుండగీండ్రు కర్రలతో దానిపైమోదారు. ఆదెబ్బకు ఒకగుండు వెడలివచ్చి 10 సం॥ ల పిల్లవాడు మరణించాడు.

ప్లాసీ యుద్ధమై 200 సం॥ లు కావస్తున్నది. ఆ 'ప్లాసీ' అనేపదము యొక్క ఉచ్చారణ విషయంలో బంగాళమున లాంచీడ్రైవర్లిద్దరికి తగాదా ఏర్పడి తన్నుకొని, పొడుచుకొన్నారు. ఇదొక ప్లాసీయుద్ధం!

♦ ♦ ♦

బొంబాయిలో ఎస్. ఎస్. ఎల్. సి పరీక్ష తప్పి పోయినాననే శోకంకొద్దీ 16 సం॥ బాలుడు విశ్వ విద్యాలయపు గడియారస్తంభము నెక్కి క్రిందపడి చనిపోయినాడు. 1904 లో ఈ స్తంభముమీదినుండే ఇద్దరు పార్శీ యువతులుపడి చనిపోయినారట. వీనియెత్తు 300 అ॥లు. మద్రాసులోను ఇద్దరు యువకులు ఈపరీక్షపోయినందుకు ఆత్మహత్యా ప్రయత్నంచేశారు. ఒకడుచచ్చినాడు; ఇంకొకడు ఆసుపత్రి చేరాడు.

♦ ♦ ♦

క్రొత్తగా ఏర్పడిన యతిరాజ్ స్త్రీకళాశాలకు శ్రీమతి రంగారావుకన్య ప్రిన్సిపాలుగా నియమింపబడినది. ఈమె క్రికెటురంగమున సుప్రసిద్ధులగు శ్రీ కే. యస్. రంగారావుగారి కుమార్తె ఈమె ప్రథమంలో క్వీన్ మేరీస్ కాలేజీలోను, లేడీ విల్లింగ్డన్ ట్రెయినింగ్ కాలేజీలోను అధ్యాపకురాలుగా నుండెను. జూనియర్ రెడ్ క్రాస్ సొసైటీకి కార్యదర్శిగానుండెను. నాగపూర్ నందలి స్త్రీలకేంద్ర కళాశాలను స్థాపించి దానికి ప్రిన్సిపాలుగా కొంతకాలము పనిచేసెను. ఇటీవల లండనులో భారత యూనియన్ రాయబారికి విద్యావిషయముల సలహాదారుగా నుండెను. అచటి సాంఘిక ఉద్యోగ ధర్మములను ప్రత్యేకముగ కృషిచేసి తెలిసుకొని వచ్చినదామె.

♦ ♦ ♦

బొంబాయిలో శంకరమఠంలో దేవతావిగ్రహం పాదాలకడ 45 రోజుల ఆడబిడ్డ తెల్లనిగుడ్డకప్పి ఉంచబడినదట. తెల్లవారి దేవాలయం తెరిచేసరికి బిడ్డ అచ్చటఉన్నదట. బిడ్డ ఆరోగ్యంగా కిలకిల లాడుతున్నది. ఎవ్వరూ నాబిడ్డఅని రానందున ఆసుపత్రికి చేర్చారు. సావిత్రి పూర్ణిమ శుభకాలమున ఎవ్వరో భక్తురాలు తనబిడ్డను దేవతార్పణం చేసినదని ఛాందసు లనుకుంటున్నారు.

♦ ♦ ♦

యునైటెడ్ నేషన్స్ సభకు శ్రీమతి లక్ష్మీ మీనన్‌సతి భారతీయప్రతినిధిగా వెళ్లియుండెను. ఆమె ఆసభకార్యాలయమున స్త్రీలయొక్క అంతస్తు శాఖకు ముఖ్యురాలుగా ఉద్యోగము స్వీకరించినది.

♦ ♦ ♦

బ్రిటిష్ దీవులనుండి స్త్రీలు పురుషులు, శిశువులు, 1,80,000 మంది.(47-49) రెండు సం॥ లలో. కెనడా, ఆస్ట్రేలియా న్యూజిలాండు, దక్షిణాఫ్రికా దేశాలకు, శాశ్వతంగా అక్కడ నివసించడానికని వలస వెళ్లినారు.



మన భారతస్వాతంత్ర్య రాజ్యాంగ చట్ట నిర్మాణసభలో (కాన్‌స్టిట్యుయంట్ అస్సెంబ్లి)—ఏ నలుగురైదుగురో మాత్రం ఎప్పుడూ నోరుచేసుకుంటున్నారు. దీనికి విసికి—"వినలేక చాలిపోతున్నాను. సభలో నిద్రపోవడానికి అనుమతివ్వండి"—అని గోపాల్‌నారాయణ సెక్సనా అనే సభ్యుడు అధ్యక్షుని అడిగినాడు. దానిని గూర్చి "పంకా క్రింద" అనే శీర్షికలో—ఇండియన్ రిపబ్లిక్ పత్రిక (10-6-49) ఇట్లని చమత్కరించినది :-

సెక్సెనాగారికి. ఆమాత్రం ధైర్యమున్నా వున్నది. భారత పార్లమెంటులోను, కాన్‌స్ అస్సెంబ్లీలోను ఎంతోమంది "నిద్రాసుందరులు"న్నారు. చాలామంది నిద్రపోవడమే కాదు; గురకకూడా పెట్టుతారు. రోజుకు రు 45ల భత్యమే వారికి ముఖ్యాకర్షణము. కొంతమంది సభ్యులు అందు కేవలము అలంకార విద్యార్థుల వంటివారు. వారెప్పుడూ నోరుతెరిచిన పాపానబోరు.

బర్మా ప్రధాని కుమార్తె డార్జిలింగులో పాఠశాలకు వచ్చిచేరింది. ఈ విషయమై బర్మా పత్రికలలో ఆందోళన రేగింది. బర్మాలో ఒకతల్లి ఇలా అన్నది:

ఇక్కడ చదువులు అధ్వాన్నంగా ఉండడంచేత చాలినవాడైన ప్రధాని మరోదశానికి తన కూతురిని చదువుకోను పంపగల్గినాడు. సామాన్య సంపాద్యంగల కుటుంబీకులము; మాపిల్లల చదువుకొరకొరకు మేమేమి చేయాలి?

ఈమే మాసాంతంలో కొడైకెనాల్‌నందు విశ్వవిద్యాలయ పట్టభద్రలగు నారీమణుల సమ్మేళనముయొక్క 41 వ సాంవత్సరిక సమావేశము జరిగినది. బ్రిటన్, ఇతర యూరపుదేశములు, అమెరికా, ఇండియా మున్నగు వివిధ ప్రాంతములలోని విశ్వవిద్యాలయముల ప్రతినిధురాండ్రంతా వచ్చారు. పట్టభద్రల బాధ్యతలగూర్చి ఆయావారి అభిభాషణములిట్లున్నవి:—

శ్రీ విమలా అప్పాస్వామికన్య

విశ్వవిద్యాలయాల్లో పట్టభద్రలైన యువతులు, స్కూళ్లలో, కాలేజీలలో, విశ్వవిద్యాలయాల్లో కేవలం ఉపాధ్యాయినులుఅయి తృప్తిపడి యుండరాదు. స్వదేశాన్నెదుర్కొన్న రాజకీయాది సమస్యల పరిష్కారమునకై కృషిచేయాలి.

డా. బ్రైస్‌సతి

తన ఇల్లు సర్వాంగ శోభతో కళకళలాడు చుండేట్లు విశ్వవిద్యాలయ విద్యావతి పాటుపడాలి. అట్టి నారీమణి తనకొక స్వతంత్రమగు ప్రత్యేక వ్యక్తిత్వమున్ను సంపాదించుకోవాలి.

శ్రీ. హిల్డా సోల్మన్ కన్య

గ్రామస్థులకు సేవచేయాలి అనే వినయంతో విద్యావతులు గ్రామాలకు చేరాలి. ఎట్టి అవకాశాలు వారికొరకు వేచియున్నాయో, వారికృషి ఎట్లా అభినందింపబడునో అక్కడ తెలుస్తుంది వారికి.

డాక్టర్ రాధాకృష్ణన్ గారు, లండన్‌లో, తా మధ్యక్షులుగానున్న - యునెస్కో - కార్యక్రమమును గూర్చి ఇట్లు చెప్పిరి :—

యూనియన్ ఛార్టర్‌నందు పేర్కొనబడ్డ నాలుగు స్వాతంత్ర్యాలు అన్నిదేశాలలో అవగాహన అయి పెంపొందాలంటే, ఈ దేశాలలో ముఖ్యవిద్యావిధానము ద్వారానే ఆ స్థితి రాగలదు. ఈ విద్యావ్యాపకము సరియైన పాఠ్యగ్రంథములద్వారా జరుగవలసియున్నది. అట్టి ఉపాయములవల్లనే మనము మన ఆదర్శమును, ప్రపంచప్రజాప్రభుత్వమును సాధించగలము.

కాంగ్రెసు ఆధిక్యతనుగూర్చి వల్లభభాయి పటేలుగారు ఇట్లన్నారు:—

నిష్పక్షపాతంగా ఎవరైనా యోచించిచూస్తే,—శాంతియుతము ధర్మసమ్మతముఅయిన పద్ధతులవల్ల ఇంత కొద్దికాలంలో ఇంతఅధికంగా మంచిసాధించగల ప్రభుత్వాన్నిగాని, రాజకీయశక్తినిగాని మరొదానిని పేర్కొనగలరా? ఈ రోజున ఇక్కడకేంద్రంలోగాని, రాష్ట్రాలలోగాని కాంగ్రెసుకన్నా భిన్నమైన ప్రభుత్వానికి అవకాశంలేదని—ధైర్యంగా చెప్పగలను.

యునైటెడ్ నేషన్స్‌లో—ఏవ్యక్తియైనా ప్రపంచంలో ఏమూలనుంచైనా : తన కష్టాలు ఫిర్యాదుచేసుకోవచ్చు—అనే తీర్మానానికి ఇండియాప్రతినిధులు చాలా కృషి చేస్తున్నారు. ఈ విషయంలో గట్టిగా పనిచేస్తున్న శ్రీమతి హన్సా మెహతాగారిట్లన్నారు:

ఈ హక్కు ఇవ్వడానికి ఇష్టంలేనివాళ్లు బెదురుతున్నారు. వీరిలో కొంతమంది ఇందుమూలాన యు. నే. సభ పని పెరిగిపోతుందంటారు. ఇతరులు స్వవిషయంలో జడుస్తున్నారు. వ్యక్తులహక్కులు కాపాడబడవలెనని కోరినరాజ్యాలవారే ఇప్పుడు జడుస్తున్నవారుకూడా. వాస్తవమేమిటంటే యు. నే. వారు తమ చర్యలలో జోక్యము కల్గించుకోడం వారికిష్టంలేదు.

# సంపాదకీయములు

## ఎగుమతి వర్తకుల మోసాలు.

ఇటీవల భారతీయూనియన్‌లో వాణిజ్యశాఖామాత్యులు నియోగిగారు తెల్పిన విషయాలు చాల అవమానకరమైనవి. మనదేశమునుండి విదేశాలకు ఎగుమతి వర్తకులు చాలా కల్తీసరుకులు పంపుతున్నారట. మిరియాలు, పసుపు, ముంతమామిడిపప్పు మొదలైనవానిలో చచ్చినవిబతికినవి పురుగులువిస్తారమట. వేరుశెనగ పప్పులో తెల్లరాళ్లుకలుపుతున్నారట. ఆముదంలో నీళ్లు, తుక్కు కలుపుతున్నారట. బేరంకుదుర్చుకోనుచూపిన నమూనాలకన్న పంపే బట్టలు హీనరకముగా ఉంటున్నవట. అందుచేత మనదేశపు విదేశవర్తకం నష్టం కావడమేగాక, భారతీయులన్యాయపరులు, దగాకోర్లుఅని అపదూరున్నూ వస్తున్నదని మంత్రిగోల పెటుతున్నాడు. దీనికి వారేవో చట్టాలు, బందోబస్తులు చేస్తారు. కాని దేశములో శీలవర్తనము వృద్ధిపొందితేనే గాని మోసాలు తగ్గవు. గృహలక్ష్ములు, తమభర్తలు, బిడ్డలు శీలసంపన్నులుగా ఉండేట్లు వారిచర్యలనుకనిపెట్టి తప్పుగర్హించే నేర్పరులైతేనేగాని భారతదేశపు కీర్తిగౌరవములు నిలువవు. స్వాతంత్ర్య భారతానికి అట్టి కీర్తి గౌరవాలు విదేశాలలో ముఖ్యంగాసంపాదించవలసిన అమూల్యసంపదలుఅని ప్రతిస్త్రీహృద్గతంచేసుకోవాలి.

## ప్రభుత్వసేవకులకు కరువు భత్యాలు.

ప్రభుత్వసేవకులలో 1000 రూ॥లపై జీతగాండ్రకు కరువుభత్యాలు వృద్ధిచేయబడ్డాయి. అయితే బ్రహ్మచారులకు ఈ అధికభత్యాలు ముట్టవట. ఇది చాలా అన్యాయమని మా అభిప్రాయము. బ్రహ్మచారులైనంత మాత్రము వారిపోష్యవర్గంలో భార్యాపిల్లలు మాత్రమే కొంతవడతారు. కాని పురుషులకు భార్యాపిల్లలేగాదు పోష్యవర్గము. ముదుసలి తలిదండ్రులు, ఇరువుచెడి ఇల్లుపట్టిన ఆడుపడుచులు, అవివాహితలైయున్న అక్కచెల్లెండ్రు వీరందరు ఆబ్రహ్మచారిమీద ఆధారపడ్డవారే. హిందూ అవిభక్తకుటుంబాల మర్యాదతెలిసిన వారందరికి ఈసంగతి తెలుస్తుంది. అసలు రు 1000/ల జీతగాడయ్యేదాకా మగపిల్లవానిని చదివించాలంటే ఎన్నోకుటుంబాలు తమఆస్తులనంతా ధారపోసుకోవాలి. అట్లాంటప్పుడు ఆకుటుంబాలు కేవలము ఆ ఉద్యోగపరులైనవారిమీదే ఆధారపడడం విశేషంగాదు. వారిని పోషించడం అతని ధర్మము కూడా. అట్టివారికి అధిక కరువుభత్యాలు లేవనడం దేశీయప్రభుత్వాలకు తగనిపని అని మామతం.

## రాధాకృష్ణయ్యగారు రష్యాకు రాయబారులట.

మామిత్రులు, శ్రీసర్వేపల్లి రాధాకృష్ణయ్యగారిని రష్యాకు రాయబారిగా పంపదలుచుకున్నారని విని చాలా సంతోషిస్తున్నాము. భారతదేశము కామన్‌వెల్తులో చేరినతరువాత రష్యారాయబారి బాధ్యత క్లిష్టమైనది. అటిక్లిష్టమైన కార్యం నిర్వహించగల సమర్థులు శ్రీరాధాకృష్ణయ్యగారు. అట్టిమహానీయుని గన్న ఆంధ్రమాతధన్య. శ్రీ రాధాకృష్ణయ్యగారికి ఆయురారోగ్యైశ్వర్యము లొసంగి ఇతోధిక కీర్తి గౌరవములు తనకు భారతదేశానికి విశేషతః ఆంధ్రదేశానికి సంపాదింప ఈశ్వరుడాయన ననుగ్రహించుగాక.

## కమ్యూనిస్టు చీనా అధ్యక్షత.

చీనా దాదాపు యావత్తున్నూ కమ్యూనిస్టుల ఆధీనమైనది. క్రొత్తకమ్యూనిస్టు రాజ్యమునకు అధ్యక్షు నెన్నుకోవలసియున్నది. ఈసందర్భమున సన్‌యట్ సేన్ సతి పేరు చెప్పబడుచున్నది. ఈమె మదాం కేషేక్ అక్కగారే. కేషేక్ పూర్తిగా జపానువారి ఆంతర్యము కల్గియున్నరోజులలో అక్కచెల్లెండ్రను

చూచుకోనివ్వలేదని విందుము. సన్ యట్ సేన్ చైనాలో జాతీయోద్యమము నేర్పరచి నవచైతన్యము కల్గించిన మహనీయుడు. అట్టిమహనీయుని కర్థాంగియై ఆయన కన్నివిధముల తోడ్పడిన ఆమె అధ్యక్షత క్రింద చీనా రాజ్యమున శాంతిస్థాపింపబడునని ఆశించెదము. భారతయూనియన్ సరిహద్దులో కమ్యూనిస్టురాజ్యమగు చీనా స్త్రీ పరిపాలితమగుట సంతసింపదగినది. ఆమెయు ఆమెభర్తయు భారతజాతీయోద్యమమునకు పరమమిత్రులైయుండిరి. ఆమె ఆ మైత్రిని రాజ్యాధ్యక్షురాలుగాను పాటించుననియు ఆశింతుము.

## వర్ణాంతరవివాహములు - మతాంతరవివాహములు.

ఈ మాసారంభమున బొంబాయిలో ఒక ఐకమత్యమహాసభజరిగింది. దానికి యూనియన్ పార్లమెంటు అధ్యక్షులు, శ్రీ మావలంకర్ గారధ్యక్షులు. భారతీయూనియన్‌లో ప్రజలలో పరస్పరమైత్రి, ఐకమత్యం పెంపొందడానికి వర్ణాంతర వివాహాలు, మతాంతరవివాహాలు జరగడం మంచిదని యొక తీర్మానము సభలో చేయబడ్డది. ఈతీర్మానంలోని ఆశయం నెరవేరుతుంది అనడానికి చాలా సంశయాలు ఆక్షేపణలూ ఉన్నాయి. వానిలో ముఖ్యమైనది అసలు ఈవిభేదాలు సంఘంలో ఉన్నంతకాలం ఏకొద్దిమందో వివాహం చేసుకొన్నంత మాత్రంచేత లాభంలేదు. మరి స్త్రీపురుషుల సాంఘికవ్యవస్థలో నేటిహెచ్చుతగ్గులున్నంతకాలం వివాహానంతరం పురుషులయొక్క కులము మతము ఆచారవ్యవహారాలు స్త్రీ అవలంబించక తప్పదు. ఆదంపతులకు కలిగే సంతానం పురుషుని మతస్థులు కులస్థులూ అవుతారుగాని కులమత వివక్షతలేని నూతన భారతజాతి కాజాలరు. కాబట్టి కనీసం స్త్రీకి ఆర్థికస్వాతంత్ర్యమన్నా పూర్తిగా ఏర్పడి ఆమె వ్యక్తిత్వం నిలుపుకోగలిగినపుడే ఆమె సంతానానికి నూతన దృక్పథం ఏర్పడగలదు. అప్పుడే ఇట్టివివాహాలు ఐకమత్యానికి దారితీయగలవు.

## అమెరికా ప్రభుత్వపు కోశాధికారిణి.

అమెరికన్ అధ్యక్షుడు ట్రూమన్ తనరాజ్యమున శ్రీమతి జార్జియా నెస్సెక్లార్క్ సతిని కోశాధికారిణిగా నియమించాడు. ఈఅపూర్వగౌరవముపొందిన స్త్రీలలో ఈమెయే మొదటిది. ఇప్పటికే ఒకబాంకు నడుపుటలో ఈమె అనుభవము గాంచియున్నది. ఈ అధికారిణి సంతకం ఇకపై అమెరికాలోని కరెన్సీనోట్లపై యుండును. అమెరికాలో ఇట్టి గొప్పపదవి కొక స్త్రీ నియమింప బడినందులకు ఆమెనెంతో మేము అభినందిస్తున్నాము. ఆమె నీపదవికి నియమించిన అధ్యక్షుడు ట్రూమన్‌నుకూడా అభినందిస్తాము. ఇట్టి గౌరవాలు, బాధ్యతిగలఅధికారాలు భారతదేశంలోకూడా స్త్రీలు అచిరకాలంలో బడయగలరు. ఇప్పటికే కొన్ని నిర్వహిస్తున్నారు కూడా.

## 'సత్యమేవ జయతే'.

ఏప్రభుత్వానికైనా ఒకనీతి, ధర్మం ఉండాలి. రాజకీయాల్లో నీతినియమాలుండవని కొందరిమతం. కాని గాంధీ ఆమార్గంనుండి భారతరాజకీయాలను తప్పించాడు. ఇప్పుడు భారత స్వతంత్ర ప్రభుత్వం వారు తమసీలులో నొకనీతివాక్యం చేర్చుకోవాలని ఆలోచించారు. ఆప్రయత్నంగానే వారిదృష్టి ప్రాచీనభారతీయ విజ్ఞానం వైపునకు మరలింది. "సత్యమేవ జయతే" అనే ఉపనిషద్వాక్యము లభించింది. గాంధీ తన జీవితమంతా సత్యాన్వేషణకే వినియోగించాడు. ఆయన నాయకత్వంక్రింద సత్యాహింసల నవలంబించి భారతభూమిస్వాతంత్ర్యం సాధించింది. అట్టి "సత్య ప్రశంస" మన 'సీలు' లో ఉండడంన్యాయం. అదే ప్రపంచానికిన్నీ భారతదేశం ఇచ్చే సందేశం. ఈ ఉపనిషద్వాక్యమే మనపతాకమునందు పొందుపరచబడ్డ ధర్మచక్రానికి విపుల వ్యాఖ్యానము. ఇట్టి ఉత్తమ నీతివాక్యమునంగీకరించిన భారత యూనియన్ ప్రభుత్వం వారు అభివందనీయులు. అయితే ఆనీతివాక్యం ఆసీలులో అక్షరరూపంగానే నిల్చిపోక ఆచరణలోనికి రావాలంటే "గృహలక్ష్ములు" తమ సంతానానికి ఈనీతిని ఉగ్గుపాలతో చాదిపోయాలి.

---




**యోగసూత్ర సిద్ధాంతము. గ్రంథకర్త: శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులుగారు. దొరుకుచోటు: మేనేజర్ 'శిల్పి" 10, నరసింగపురంవీధి, మౌంటురోడ్డు, మద్రాసు. వెల రు. 2-4-0 లు**

నిరంతరం రాజకీయ సంచారప్రచారాలలో నలిగే ప్రకాశంపంతులుగారు 1942-45ల మధ్య నిర్బంధావాసములో కలిగిన అవకాశం ఉపయోగించుకొని "పతంజలి యోగదర్శనంలోని గహనవిషయాలన్నీ క్రోడీకరించి, శాస్త్రవిషయాలకు సాధ్యమైనంత సులభశైలిలో... జనసామాన్యానికి" ఈ గ్రంథరూపాన అందించారు. "ఈ గ్రంథం ఆంధ్రంలో అంతటా యోగసూత్రవిషయమైన జిజ్ఞాసను రేకెత్తించగలదనీ, పాతంజలి యోగదర్శన సిద్ధాంతాల అవగాహనకు అత్యంత సహాయకారికాగలదనీ" ప్రవేశికవ్రాసిన శ్రీ పిలకా గణపతిశాస్త్రిగారు "ఆశిస్తున్నారు." మేము వీరితో పూర్తిగా ఏకీభవిస్తున్నాము. గ్రంథమంతా సులభశైలి వ్యావహారికభాషయే గాని. పరాకులేక పదములవాడవలసిని నీశాస్త్ర వివరణములో కొన్నిపదాలకు అన్వయంకుదరడంలేదు 60-వ పుటలో "కూర్చున్నప్పుడు... వెన్నెముక, మెడ, తల అన్నియు నొక పఙ్క్తిలో నున్నట్లుంచవలెను" అన్నారు. అట్టి "పఙ్క్తి" వరుసన్నపుడు ఏర్పడునుగాని కూర్చున్నపుడెట్లుసాధ్యము? ఒకదానిప్రక్క నొక్కటి వరుసగానున్నపుడే 'పఙ్క్తి' అందురు. శాస్త్ర సాంప్రదాయములను పంతులుగారు పూర్తిగా అంగీకరించుటలేదు. "ముద్రల"ను గారడిచిన్నెలు (Magical Symbols) పొమ్మన్నారు.

**తెలుగు విజ్ఞాన సర్వస్వము: పరిచయ సంపుటి: తెలుగుభాషా సమితి.**

ఇదివరలో కీ॥ శే॥ కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు ప్రారంభించగా శ్రీ నాగేశ్వరరావు పంతులుగారిచే కొంతకాలం సాగింపబడిన "ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము"-కొనసాగలేదు; దానికి ముఖ్యకారణం-ఆయనసముద్రానికి ఏతంవేయనారంభించినారు. అట్లుగాక ఏదోయొక సమగ్రరూపంయొక్క హద్దులేర్పరచుకొని కాలనిర్ణయంచేసుకొని అందులో ముగించియున్నట్లైతే పిదపవారు క్రమంగా దానిని అభివృద్ధిపరచుకుంటూ ఉందురు. ప్రస్తుతం భాషాసమితివారి నూతనయత్నం ఆవైఖరినే సాగుతున్నది. వీరు తెలుగువిజ్ఞానసర్వస్వాన్ని 12 సం పుటాలలో, వివిధ విషయాలను విడదీసి ప్రచురింపదలచినారు; 'అకారాది' సంజ్ఞనకాదు. అట్లా ప్రచురింపబోయే తె. వి. సర్వస్వమెట్లా ఉండునో దానిని "స్థాలీపులాక న్యాయమున తెలియబరచవచ్చునన్న ఆశయముతో వ్యాసముల భాగములు కొన్నిచేర్చి ఈపరిచయ సంపుటి" ప్రకటించారు. వ్యాసములతో చక్కని బొమ్మలనుకూడా చేర్చినారు. దీనిని విపులముగా విమర్శింప నిటస్థలముచాలదు. విదుషీమణులైన స్త్రీలు విపులముగా విమర్శించివ్రాస్తే ప్రకటించుతాము. మొత్తమున ఈపద్ధతిలో సమగ్రరూపంతయారైతే-"తెలుగువిజ్ఞాన సర్వస్వం" క్రమంగా అభివృద్ధిపరచను ప్రాతిపదిక వేసినట్లవుతుంది.

సమీక్ష: సంపాదకులు: కె. రాధాకృష్ణమూర్తిగారు కార్యాలయం, మారీసుపేట తెనాలి. సం॥ చందా రు 6-0-0 లు.

ఇది క్రొత్తగా వెలువడిన తెలుగు మాసపత్రిక, మిగతమాసపత్రికలలోవలెనే కొన్నికథలు, వ్యాసాలు, చిత్రాలు ఉన్నాయి.

రాష్ట్రపతి పట్టాభి: జాతీయజ్ఞానమందిరము, మద్రాసు-14. వెల రు. 1-0-0

డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్య పంతులుగారు రాష్ట్రపతి అయినపిదప అంతవరకుజరిగిన ఆయన జీవితవిశేషాలు క్లుప్తంగా 'శతభిష'.అనేమారుపేరుతో ఆంగ్లభాషలో వ్రాయబడి ప్రకటింపబడినవి. అవియే'సింగరాచార్య' గారిచేత ఇట్లు ఆంధ్రలోకి అనువదింపబడినవి. ఈ రెంటిని జాతీయజ్ఞానమందిరం వారే ప్రచురించారు. ఈప్రచురణ సంస్థను శ్రీ బాపినీడుగారు నడుపుచున్నారని ఆంధ్రులకెరుకయే. వారిట్టిగ్రంథసామగ్రిని తయారుచేయుటలో దిట్టలు. ఈపుస్తకం చిన్నరూపంలో, తక్కువఖరీదులో,సమగ్రంగా పట్టాభిగారి జీవితచరిత్ర తెలుపుచున్నది. నాయకత్రయు రిపోర్టుమీద రేగిన గాలిదుమారములో-డాక్టరుగారు ఎగిరిపోకుండా నిలువబడగలంత తూకము కలదే వారి 70 సం॥ పూర్వచరిత్రఅని ఈగ్రంథం బాగా స్థాపించంగలదు.

ముందడుగు: సంవత్సరాది స్పెషల్: 88 గోవిందప్పనాయకవీధి, మద్రాసు. వెల 0-8-0

కథలతో, వ్యాసాలతో, వ్యంగ్యాలతో, కరకరలాడే రాజకీయాలతో యథోచితంగా తయారైంది.

గోసేవ: సంపాదకులు: అభినవ సహదేవ యేజర్ల శ్రీరాములు చౌదరిగారు, మారిస్‌పేట, తెనాలి. సం॥చందా రు. 4-0-0 లు.

ఇది మాసపత్రిక. శ్రీరాములుగారు చిరకాలముగా పశువైద్యం విషయమై కృషిచేసి తాము తెలుపుకోవడమేగాక, గ్రంథాలువ్రాసిన్నీ పలువురు విద్యార్థులను తర్ఫీదుచేసిన్నీ పశువృద్ధికై చాలా పనిచేస్తున్నవారు. వారి సంపాదకీయాన వెలువడుతున్న "గోసేవ" నిజమైన "గోసేవ" చేయగలదని మా అభిప్రాయం.

శ్రీ కాట్రగడ్డవారి స్థానికోన్నత పాఠశాల సారస్వత వార్షిక పత్రిక. 1949. ఇంటూరు, గుంటూరు జిల్లా.

హైస్కూలు విద్యార్థులు వెలువరించిన ఈ పత్రిక హృద్యముముగా ఉన్నది. ఉపాధ్యాయుల ప్రోత్సాహంలేనిది ఇట్టి కార్యం నెరవేరదు. అయితే ఉపాధ్యాయులు, పత్రికనంతా ఔపాసనపట్టక ఏ కొద్ది వ్యాసాలతోనో తృప్తిపొంది పిల్లకాయలచేతగూడా కొన్ని వ్రాయించారు. వీరిలో అప్పాంబ, రాఘవదేవి అనే బాలికలిద్దరుకూడా ఉండడం సంతోషదాయకం. పాతవిద్యార్థియొకరు తమ పూర్వానుభవాలను వ్రాస్తూ ఈ స్కూలులో హెడ్మాస్టరుగా నుంటూవచ్చిన మా మిత్రులు, నెల్లూరివాసులు కీ॥ శే॥ ముత్తరాజు శివకామయ్యగారిని ప్రస్తావించారు. వారు బెత్తంచూపి కాక ప్రేమతంతువులచేతనే పిల్లలనదుపాజ్ఞలలోఉంచారని చెప్పడం - ఆయనకేకాదు; నెల్లూరికేకీర్తి. అట్టి ప్రధానోపాధ్యాయులు నేడు చాలా అవసరం. ఈ పాఠశాల విద్యార్థులను ఇతరపాఠశాల విద్యార్థులుకూడ ఇట్టి సంచికలవేయుటలో

అనుసరించదగును. ఈ పాఠశాల విద్యార్థులకొక పార్లమెంటట. దానికొక మంత్రివర్గమట. ఆ మంత్రివర్గంలో ఒకబాలిక చి॥ రాజేశ్వరి మంత్రిణియట. ఆమె కళలు, పరిశ్రమలు పరిపాలిస్తుందట. "గృహలక్ష్మి"కి అచ్చివచ్చిన పరిపాలనా శాఖలు !

కళాజీవి (పూర్వఖండము) కవి : శ్రీ మధురకవి బెళ్లూరి శ్రీనివాసమూర్తిగారు. తలమర్ల పోస్టు, అనంతపురంజిల్లా.

మధురకవి - పలుపత్రికల ప్రచురించిన ఖండకావ్యములను కొన్నింటిని సంపుటముగా తయారు చేయగా నీ చిన్నిగ్రంథమైనది. ఇందలి ప్రతి పద్యము శ్రీనివాసమూర్తి సత్యముగ మధురకవియేయని చాటుచున్నది. దీని నుపోద్ఘాతము రచించిన శ్రీ రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారు "రాయలసీమలోని పల్లెటూరి వివిక్త జీవితమునకే అలవాటుపడి అందే తమ భావనానందయోగమున మగ్నులైన కవులెందరో యున్నారు. వారిలో అగ్రపంక్తి ఈ గ్రంథకర్తగారిది." అన్నారు. ఇంతకన్న నేమని దీనిని ప్రశంసింప గలము? ఈ కవి ఎంత సహృదయుడో గనుడు: కేవలము తమ కవితామృతమునే కాదు; దానిని ధరించు చున్న అచ్చుగ్రంథమును, వ్యయసాధ్యమైననుకూడ ఉచితముగ పంచిపెట్టుచున్నాడు. నిజముగా 'కళా జీవి'యే !

---

# సతీహితవాక్కు

వినయంబున్ పతిభక్తియున్ గురుతరావిద్యా విహీనత్వముఁ
ఘనసౌజన్యము దైవభక్తియు మహా కారుణ్యసంపత్తి ప్రా
క్తన సాధ్వీమణు లందియున్న గృహిణీ ధర్మంబు లిట్లౌట నీ
వును జూడంగొను మట్టి సద్గుణగణంబుఁ బ్రీతి నాయుష్మతీ !

అనుపమ సాధ్వులఁ గనియే మనభారతమాత జగతి మాన్యతఁగాంచెఁ
వనితాజన గుణవర్తనమున నే లోకములు నిలుచుఁ బొలియుక సాధ్వీ.

ప్రాచీనార్వాచీన సమీచీనగుణాభివృద్ధి మెప్పంగని నీ
వాచంద్రకముగఁ దరుణీ శౌచంబున జగతిఁ బ్రోవఁ జాలుదువు సతీ.

బులుసు వేంకటేశ్వర్లు.

# శ్రీ విరోధినామ సం॥ర జ్యేష్ఠ, ఆషాఢమాసములు

| | | | |
|---|---|---|---|
| | 16 | గు | ష. 56-31 ధ 20-1 రావి 7-13 ధగ్ధయోగః. |
| | 17 | శు | స. 60 0 శత 25-33 రావి 10-43 బుజ్యేబుధః. |
| | 18 | శ | స. 0-56 పూభా 31-48 రావి 25-45 అనధ్యాయద్వయం. |
| | 19 | ఆ | అ. 6-52 ఉభా 38-21 |
| | 20 | సో | న. 10-55 రే 44-47 దివి 11-34 |
| | 21 | మం | ద. 15-39 అశ్వి 50-43 రా 7-12 |
| జూన్ | 22 | బు | ఏ. 19 39 భ 55-47 ద్వాదశీతిథిః సర్వేషామేకాదశి. |
| | 23 | గు | ద్వా. 22.40 కృ 59-50 దివి 17-48 శూన్యతిథిః. |
| | 24 | శు | త్ర. 24-30 రో 60.0 త్రయోదశీతిథిః మాసశివరాత్రి. |
| | 25 | శ | చ. 25-6 రో 2-39 చతుర్దశీతిథిః. |
| | 26 | ఆ | ● 24-26 మృ 4.12 రా 24-26 ని 25-19 అమావాస్యాతిథిః. |

## ఆ షా ఢ మా స ము.

| | | | |
|---|---|---|---|
| | 27 | సో | శుపాడ్యమి 22-31 ఆర్ద్ర 4-33 రా 1-39 తిథిద్వయం. |
| | 28 | మ | వి. 19-29 పున 3-50 దివి 23-13 తృతీయ తిథిః. |
| | 29 | బు | త. 15-29 పుష్య 1-58 |
| 1949–వ సం॥ | 30 | గు | చ 10-39 మ 55-59 దివి 27-38 స్కందపంచమీ. |
| | 1 | శు | పం. 5-13 షష్ఠి 54-8 పుష్య కుమారషష్ఠి. |
| | 2 | శ | స. 53-13 ఉఫ 48-5 ఆర్ద్ర 4-0 |
| | 3 | ఆ | అ. 46-57 హ 43-54 భ 20.5 మహిషాసురమర్దనీ పూజా. |
| | 4 | సో | స. 40-54 చి 39-52 రావి 20.34 పుష్యగ్రహజన్మయోగః. |
| | 5 | మం | ద. 35-10 స్వా 36-10 రావి 17-0 పూర్ణజలరాశౌ శ్రీపురుషనక్షత్రః |
| | 6 | బు | ఏ. 29-59 విశా 33-0 రా 30-2 సర్వేషాంశయనైకాదశి చాతుర్మాస్య వ్రత [ప్రారంభం గోపద్మ వ్రతప్రారంభం. |
| | 7 | గు | ద్వా 25-31 అనూ30-35 రావి 11-49 ద్వాదశీ తిథిః. |
| జూలై | 8 | శు | త్ర. 20-56 జ్యే 29-1 తిథి ద్వయం. |
| | 9 | శ | చతు. 19-20 మూ. 28.30 రా 20-24 పూర్ణిమాతిథిః. |
| | 10 | ఆ | ○ 17.59 పూషా 29.10 రా 17-26 ప్రతిపత్తిథిః వ్యాసపూజా. |
| | 11 | సో | బ. పాడ్యమి 12.50 ఉషా. 31-3 రావి 9-14 ద్వితీయాతిథిః. |
| | 12 | మం | వి. 18.58 శ్ర 34-12 రావి 12.35 తృతీయాతిథిః |
| | 13 | బు | త. 2122 ధ 38-30 రా 25-48 దగ్ధయోగః. |
| | 14 | గు | చ. 24-51 శ 43-49 శా 24-50 శేష 2 27. |
| | 15 | శు | పం. 29-11 పూభా 49-56 ది 1-27 |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd
15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.

# శ్రీ విరోధినామ సం॥ర జ్యేష్ఠ, ఆషాఢమాసములు

| | | | |
|---|---|---|---|
| | 16 | గు | వ. 56.31 ధ 20-1 రావి 7.13 దగ్ధయోగః. |
| | 17 | శు | వ. 60 0 శత 25.33 రావి 10.43 బుజ్యేబుధః. |
| | 18 | శ | వ. 0.56 పూభా 31.48 రావి 25.45 అనధ్యాయద్వయం. |
| | 19 | ఆ | అ. 6.52 ఉభా 38.21 |
| | 20 | సో | న. 10.55 రే 44.47 దివి 11.34 |
| జూన్ నెల | 21 | మం | ద. 15.39 అశ్వి 50.43 రా 7.12 |
| | 22 | బు | ఏ. 19 39 భ 55.47 ద్వాదశీతిథిః సర్వేషామేకాదశి. |
| | 23 | గు | ద్వా. 22.40 కృ 59.50 దివి 17.48 శూన్యతిథిః. |
| | 24 | శు | త్ర. 24.30 రో 60.0 త్రయోదశీతిథిః మాసశివరాత్రి. |
| | 25 | శ | చ. 25-6 రో 2.39 చతుర్దశీతిథిః. |
| | 26 | ఆ | ● 24.26 మృ 4.12 రా 24.26 ని 25.19 అమావాస్యాతిథిః. |

ఆ షా ఢ మా స ము.

| | | | |
|---|---|---|---|
| | 27 | సో | శుపాడ్యమి 22.31 ఆర్ద్ర 4.33 రా 1.39 తిథిద్వయం. |
| | 28 | మ | వి. 19.29 పున 3.50 దివి 23.13 తృతీయ తిథిః. |
| | 29 | బు | త. 15.29 పుష్య 1.58 |
| 1949-వ సం॥ | 30 | గు | చ 10.39 మ 55.59 దివి 27.38 స్కందపంచమి. |
| | 1 | శు | పం. 5.13 షష్ఠి 54.8 పుష్య కుమారషష్ఠి. |
| | 2 | శ | స. 53.13 ఉఫ 48.5 ఆర్ద్ర 4.0 |
| | 3 | ఆ | అ. 46.57 హ 43.54 భ 20.5 మహిషాసురమర్దనీ పూజా. |
| | 4 | సో | న. 40.54 చి 39.52 రావి 20.34 పుష్యగ్రహజన్మయోగః. |
| | 5 | మం | ద. 35.10 స్వా 36.10 రావి 17.0 పూర్ణజలరాశా శ్రీపురుషనక్షత్రః |
| | 6 | బు | ఏ. 29.59 విశా 33.0 రా 30.2సర్వేషాంశయనైకాదశి చాతుర్మాస్య వ్రత ప్రారంభం గోపద్మ వ్రతప్రారంభం. |
| | 7 | గు | ద్వా 25.31 అనూ30.35 రావి 11.49 ద్వాదశీ తిథిః. |
| జులై నెల | 8 | శు | త్ర. 20.56 జ్యే 29.1 తిథి ద్వయం. |
| | 9 | శ | చతు. 19.20 మూ. 28.30 రా 20.24 పూర్ణిమాతిథిః. |
| | 10 | ఆ | ○ 17.59 పూషా 29.10 రా 17.26 ప్రతిపత్తిథిః వ్యాసపూజా. |
| | 11 | సో | బ. పాడ్యమి 12.50 ఉషా. 31.3 రావి 9.14 ద్వితీయాతిథిః. |
| | 12 | మం | వి. 18.58 శ్ర 34.12 రావి 12.35 తృతీయాతిథిః |
| | 13 | బు | త. 2122 ధ 38.30 రా 25.48 దగ్ధయోగః. |
| | 14 | గు | చ. 24.51 శ 43.49 శా 24.50 శేష 2 27. |
| | 15 | శు | పం. 29.11 పూభా 49.56 ది 1.27 |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd
15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.